# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధముల శాఖ ; ఆంధ్ర ప్రదేశ్.


Registered No. H-373.

సంపుటి 2 అక్టోబర్, 1958—ఆశ్వయుజము, శాలివాహనశకము-1880 సంచిక 12

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడినది.



రాష్ట్ర రెవిన్యూ శాఖామంత్రి శ్రీ కళా వెంకటరావు 31-8-58 న మేడ్చల్ తాలూకా కుతుబుల్లా పురంలో భూమిసాగును ప్రారంభించారు.



వైస్ - అడ్మిరల్ రామదాసు కటారి 13-9-58 న హైదరాబాదులో ఎన్. సి. సి. 13వ. ఆంధ్ర నేవల్ యూనిట్టును ప్రారంభించారు. అప్పుడు ఆయన కేడెట్లను తనిఖీ చేయుటను చిత్రంలో చూడవచ్చు.



# ఆంధ్రప్రదేశ్

అక్టోబర్, 1958.

సంపుటి 2 | సంచిక 12

ఆశ్వయుజము, శాలివాహనశకము-1880

## విషయసూచిక



## ముఖచిత్రం

హైదరాబాదు-విజయవాడ రహదారిలో పాలేరునదిపై నిర్మించబడిన వంతెన.
ఇటీవల దీనిని రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు.

— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి
సిటిజన్‌ప్రెస్‌లో ముద్రింపబడినది.

# చిన్న తరహా పరిశ్రమలకు ప్రోత్సాహం

**చిన్నతరహా పరిశ్రమలు దేశ ఆర్థిక వ్యవస్థలో ఒకభాగం. వాటిని విస్తరింపజేసి ప్రజలకు పని కల్పించే అవకాశం వుంది. ఈ చిన్నరకం వృత్తులను చేపట్టిన వారికి అవసరమైన ఆర్థిక, సాంకేతిక సహాయాలను సమకూరుస్తే వారు నైపుణ్యాన్ని సంపాదించి యెక్కువ సంస్కృతిగల వ్యక్తుల అభిరుచులకు అనుగుణమైన వస్తువులను తయారు చేయ గలుగుతారు. పంచవర్ష ప్రణాళిక పథకాల క్రింద మన రాష్ట్రంలో యివి వారికి అధికంగా లభిస్తున్నాయి.**

ఆంధ్రప్రదేశ్‌లో చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధికై. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద రూ. 313.44 లక్షలు—రూ. 213.94 లక్షలు ఆంధ్రకు, రూ. 99.50 లక్షలు తెలంగాణాకు కేటాయించబడినవి. ఇవిగాక, రాష్ట్రంలో పారిశ్రామిక కేంద్రాల స్థాపనకై రూ. 97.38 లక్షలు, రూ. 64.72 లక్షలు ఆంధ్రకు, రూ. 32.66 లక్షలు తెలంగాణాకు కేటాయించబడ్డాయి.

చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధికి ప్రోత్సాహమిచ్చుటకై ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వం సహాయంతో, పారిశ్రామిక కేంద్రాల స్థాపన, డిపార్టుమెంటల్ ట్రైనింగు, వుత్పత్తి యూనిట్ల స్థాపనలకు, చిన్నతరహా పారిశ్రామికులకు అప్పులిచ్చుటకు చర్య తీసుకుంటున్నది.

## పారిశ్రామిక కేంద్రాలు

పారిశ్రామిక కేంద్రాలలో ఫ్యాక్టరీ భవనాలు ఒక పద్ధతి ప్రకారం నిర్మింపబడతాయి. అవి పారిశ్రామికులకు అద్దెకు యివ్వబడతాయి. లేదా అద్దె కొనుగోలు పద్ధతిమీద అమ్మబడతాయి. లేదా వాటిని వారు ఒకేసారి డబ్బుయిచ్చి కూడా కొనుక్కోవచ్చు. ఈ ఫ్యాక్టరీ భవనాలకు నీటి సరఫరా, విద్యుచ్ఛక్తి, మురుగు పారుదల, రవాణా మున్నగు మామూలు సౌకర్యాలన్నీ వుంటాయి. ప్రభుత్వం యింతవరకూ రూ. 87 లక్షల ఖర్చు పై హైదరాబాదు (సనత్ నగర్), విశాఖపట్నం, విజయవాడ, సామర్లకోట లలో నాలుగు పారిశ్రామిక కేంద్రాల స్థాపనను మంజూరు చేసింది.

1957-58లో వాటిపై రూ. 19.38 లక్షలు ఖర్చు చేయబడినవి. జరిగే సంవత్సరంలో వీటిపై రూ. 36.62 లక్షలు ఖర్చు కాగలవని భావించబడుతున్నది. వీటిలో వరంగల్లు, నంద్యాలల పారిశ్రామిక కేంద్రాలకు కేటాయించబడిన రూ. 3.5 లక్షలు కూడా చేరివున్నాయి. వీటికి సంబంధించిన ప్రతిపాదనలు ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి.

## మరి కొంత సొమ్ము

ప్రణాళికకాలంలో ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక కేంద్రాల మొత్తం కేటాయింపు రూ. 70 లక్షలు అని కేంద్ర ప్రభుత్వానికి తెలియచేయబడింది. ఇది సరిపోదు కాబట్టి యీ కేటాయింపును అధమం రూ. 100 లక్షలకు పెంచమని కోరడం జరిగింది. సనత్‌నగరంలోని 17 ఫ్యాక్టరీ భవనాలు యించుమించు నెలలో పూర్తి అయి, పారిశ్రామికుల వుపయోగానికి సిద్ధం కాగలవని భావించబడుతున్నది. విశాఖపట్నం, పారిశ్రామిక కేంద్రంలో కూడా 20 ఫ్యాక్టరీ భవనాలు త్వరలోనే పూర్తి కాగలవని భావించబడుతున్నది. విజయవాడ, సామర్లకోటల లోనిపారిశ్రామిక కేంద్రాల పని జరుగుతున్నది.

రాతి గొట్టాల ఫ్యాక్టరీ. 19. తాడేపల్లి గూడెం, కడపలలో రెండు సాధారణ ప్రయోజన ఇంజనీరింగు వర్కుషాపులు. 20. ములుగ్‌లో కొయ్యబద్దలు, 'వీనీర్స్' ఫ్యాక్టరీ.

ఇటీవల దిగువ 4 పథకాలు, జరిగే సంవత్సరంలో రూ. 33.15 వ్యయంపై మంజూరైనవి. వాటి అమలుకై చర్య గైకొనబడుతున్నది

1 చిన్నతరహాపరిశ్రమలు, కుటీర పరిశ్రమల పరిశోధన సంస్థ.

2 స్మాల్ గేజ్ ఇన్సులేటెడ్ రాగితీగల తయారీ.

3 ఫ్రాక్షనల్ హెచ్. పి. మోటార్ల తయారీ.

4 రేడియో భాగాలు, రేడియోసెట్ల తయారీ.

పరిశ్రమలకు ప్రభుత్వ సహాయం చట్టం క్రింద కుటీర పారిశ్రామికులకు, చిన్నతరహా పారిశ్రామికులకు మధ్యకాలిక, దీర్ఘకాలిక ఋణాలు యివ్వబడుతున్నాయి. ఆ ప్రకారం యీ పద్దుక్రింద జరిగే సంవత్సరం రూ. 14 లక్షల అప్పులు యివ్వాలని సంకల్పించబడింది.

పారిశ్రామిక కేంద్రాలకు అవసరమైన సొమ్ము కాక, జరిగే సంవత్సరానికి ఆమోదింపబడిన ప్రణాళికలో చేసిన కేటాయింపు ప్రకారం, డిపార్టుమెంటల్ చిన్నతరహా పరిశ్రమల పథకాలు, అజమాయిషీ సిబ్బంది ఖర్చు, పరిశ్రమలకు ప్రభుత్వ సహాయ చట్టం క్రింద అప్పులపై మొత్తం రూ. 58 లక్షలు ఖర్చు కాగలవు. ఇందులో రూ. 7.5 లక్షలు గ్రాంటుగాను, రూ. 22.5 లక్షలు అప్పుగాను యిచ్చుటకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది.



# లేపాక్షి వీరభద్రస్వామి దేవాలయం

(డా. ఎమ్. రామారావు)

లేపాక్షి గ్రామం అనంతపురం జిల్లా హిందూపురం తాలూకాలో వున్నది. హిందూపురానికి 9 మైళ్ళ దూరంలోగల యీ గ్రామానికి బస్సులో సులభంగా వెళ్ళవచ్చు. ఇది యిక్కడగల పెద్ద నందికి, వీరభద్ర దేవాలయానికి ప్రసిద్ధి. నందికి లేపాక్షి బసవయ్య అని పేరు. వీరభద్ర దేవాలయంలో యెన్నో సుందర శిల్పాలూ, కుడ్యచిత్రాలూ వున్నాయి. ఇవన్నీ కూడా 16వ శతాబ్దికి చెందినవై విజయనగర శిల్పపద్ధతిలో మలచబడినవి.

ఈ దేవాలయంలో క్రీ. శ. 1533-1681 మధ్య కాలాలకు (ఎమ్. ఇ. ఆర్. 1912 నెంర్లు : 88-90, 569-583) చెందిన శిలాశాసనాలు 18 వున్నాయి. వీటిలో చాలభాగం విరూపన్న, అతని సోదరుడు వీరన్న, యితరభక్తులు దేవాలయానికి యిచ్చిన కానుకలను గురించి పేర్కొంటున్నవి. ఈ శాసనాలలో వీరేశ్వర లేక వీరభద్రాలయం, పాపవినాశేశ్వర, రఘునాథదేవ, రామాలయాలు పేర్కొనబడినవి. వీరభద్ర దేవాలయం కూర్మశిల అనే కొండపై నిర్మించబడింది. ఈ గ్రామం, 16 వ శతాబ్దంలో రొద్దనాడు సబ్-డివిజన్ అయిన సాదలి-వెంటెలో వుండేది. రొద్దనాడు మళ్లీ పెనుగొండ రాజ్యంలో ఒక డివిజన్‌గా వుండేది. విజయనగర వుద్యోగిఅయిన విరూపన్న పెనుగొండలో నివసించేవాడని, యీ దేవాలయాన్ని అతడు నిర్మించేడని స్థానిక గాథల వల్ల తెలుస్తున్నది. రామదాసు అనే గోపన్న భద్రాచల దేవాలయాన్ని నిర్మించినట్లే యీ వుద్యోగి లేపాక్షి దేవాలయాన్ని ప్రభుత్వధనంతో నిర్మించినట్టు కనబడుతుంది. ఈ విషయం తెలిసి అధికారులు విరూపన్నను బంధించి కారాగృహవాసం విధించారు, తత్ఫలితంగా యీ దేవాలయం అసంపూర్తిగా నిలిచిపోయింది. ఈ గాథలో కొంత నిజం వుండవచ్చు. ఎందువల్లనంటే, యీ దేవాలయంలో కల్యాణ మంటపం పూర్తిగా నిర్మింపబడలేదు. కోవెలపై కప్పులో పడిమెంపున చిత్రించబడిన చిత్రాలలో యీ విరూపన్న ప్రముఖంగా కనిపిస్తాడు. ఇతడూ, శిలా శాసనాలలోని విరూపన్నా ఒకరే కావచ్చు.

గ్రామానికి తూర్పున, వుత్తరంవైపున చిన్న చిన్న కొండలు కొన్ని వున్నాయి. వీరభద్ర దేవాలయం వుత్తరాన గల కొండపై నిర్మించబడింది. దేవాలయం వుత్తరభాగంలో కొండశిఖరంపై వుంది. దానికి దక్షిణాన యెన్నో గండశిలలు వున్నాయి. దేవాలయం ముందర విరూపన్న ఒకదానిలో ఒకటి యేడు ప్రాకారాలను నిర్మించాడని చెబుతారు స్థానికులు. వాటిలో నాలుగు యిప్పటికీ వున్నాయి. కొండను యెక్కడానికి కొన్ని మెట్లు వున్నాయి.



దేవాలయానికి వెళ్లే మార్గము

## మొదటి ప్రాకారం, ప్రహరీ

ఈ దేవాలయానికి ఒకదానిలో ఒకటి రెండు ప్రహరీగోడలున్నాయి. మొదటి పరిహారీగోడ పెద్ద

పెద్ద రాళ్ళతో నిర్మించబడింది. ఈ రాళ్లు సాదాగా వున్నాయి, ఒకదానిలో ఒకటి బిగించబడి వున్నాయి. వాటిపైన అక్కడక్కడ శాలలు, కర్ణకుడులు వున్నాయి. ఈ గోడకు నాలుగు ద్వారాలున్నాయి. కాని తూర్పు, దక్షిణ, పశ్చిమాలగల ద్వారాలు మూసివేయబడి వున్నాయి. ప్రధానద్వారం వుత్తరం వైపున వుంది. దీనికి మెట్లు వున్నాయి. పైన గోపురం వుంది.



కల్యాణ మండపం

మొదటి ఆవరణలో చాలా కట్టడాలున్నాయి. ద్వారానికి యెడమవైపున పెద్ద వరండా వుంది. దానిలో రెండువరుసల స్తంభాలున్నాయి. స్తంభాలు ఒక్కొక్క వరుసలో 16 చొప్పున వున్నాయి. దాని యెడమవైపున వుత్తర, తూర్పు గోడల కోణంలో నలు చదరంగా వున్న మండపం వుంది. తూర్పు ద్వారానికి యిరుపక్కలా స్తంభాల వరండాలు రెండు వున్నాయి. దక్షిణపు గోడనుబట్టి మరొక స్తంభాల వరండా, నలుచదరపు మండపం వున్నాయి. పశ్చిమద్వారానికి యిరువైపులా రెండు వరండాలు వున్నాయి. అటువంటిదే మరొక వరండా వుత్తరపు గోడలోపలి భాగాన్ని అంటివుంది. అది వుత్తరద్వారం వరకూ వుంది.

## రెండవప్రాకారం, ప్రహరీ

మొదటి ప్రహరీ వుత్తర ద్వారానికి ఆవల స్వల్పంగా కుడివైపున వుంది రెండవ ప్రహరీ ప్రధాన ద్వారం. ఈ ద్వారంపైన గోపురం వుంది, అది చాలాభాగం పడిపోయింది. దాని పాద తలాన్ని, యితర అలంకారాలతోపాటు, యేనుగలు, యోధులు, వివిధ నాట్య భంగిమలలో స్త్రీ ప్రతిమలు వరుసలలో చిత్రించ బడినవి. ఎన్నో కుడులు, శాలలు వున్నవి. గోడలు కుంభ పంజరములు, శాలలతో అలంకరించ బడినవి. ఈ ద్వారానికి యెదురుగా బలిపీఠము, ధ్వజస్తంభము వున్నాయి.

రెండవప్రహరీ వుత్తర, తూర్పుగోడల కోణంలో పొడుగ్గా సన్నంగా వున్న మండపంవుంది. దానికి రెండు వరుసల స్తంభాలున్నాయి. ఒక్కొక్క వరుసలో ఆరేసి సాదా స్తంభాలున్నాయి.



గండశిల పడమటి చివరగల గణపతి

ఆగ్నేయమూల నాలుగు స్తంభాల వరండాతో ఒక ఖాళీహాలు వుంది. ఈ స్తంభా లన్నిటిపైన పద్మలత మలచ బడింది.

కల్యాణ మండపం దక్షిణ, పశ్చిమ గోడలవల్ల యేర్పడే కోణంనుంచి ప్రారంభమై వుత్తరంగా ముందుకు వెడుతుంది. దీనికి పశ్చిమాన పైన విమానంగల ఒక చిన్న మండపం వుంది. దానిలో హనుమంతుని విగ్రహం చెక్కబడిన పలక వుంది.

ఈశాన్యమూల ఒక చిన్న మండపం వుంది. దానికి నాలుగు వరుసల స్తంభాలున్నాయి. ఒక్కొక్క వరుసలో మూడేసి స్తంభాలున్నాయి. దీనిని అంటి మరొక మండపం వుంది. దాని స్తంభాలపై కొన్ని శిల్పాలు చెక్కబడినవి.



వీరభద్రాలయం విమానం

రెండవ ఆవరణలో వీరభద్ర దేవాలయానికి తూర్పున పెద్దగండ శిల ఒకటి వుంది. దాని పశ్చిమ కొనలో గణపతి విగ్రహాంగల చిన్న ఆలయం మలచ బడింది. దాని తూర్పు కొనని పెద్ద సర్పం పడగపైగల పేటపై పెద్ద లింగం శిల్పం వుంది.

ఈ గండ శిలకు పశ్చిమానగల పలకపై సప్తమాత్రికల విగ్రహాలు వున్నాయి.

## వీర భద్రాలయం

లేపాక్షిలో ముఖ్యాకర్షణ యీ ఆలయమే. ఇందులో నాట్య మండపం, నలుచదురంగా వున్న హాలు వున్నాయి. ఈ హాలుకు మూడు వైపుల 7 ఆలయాలున్నాయి. నాట్య మండపం రెండవ ఆవరణ వుత్తర ద్వారానికి ముని ముందర వుంది. నలుచదరపు హాలు దానికి దక్షిణాన వుంది.

నాట్య మండపం దీర్ఘ చతురస్రంగా వుంది. దానిలో వివిధ రకాల స్తంభాలు 70 వున్నాయి. దాని అడుగుభాగం క్రింది సన్నావుండి సాదాగా



విష్ణ్వాలయం విమానం

వుంది. దానిపై పద్మాలు, అక్కడక్కడ కీర్తిముఖాలు వున్నాయి. ముందర కోణాలు ఒక్కొక్క దాని వద్ద రెండు గుర్రాలు వున్నాయి. చూచే వారికి పైకట్టడాన్నంతటినీ అవి లాగుతున్నాయా అనిపిస్తుంది. ఈ మండపంలోని ప్రతి స్తంభానికి పైన ఆమలకములు వున్నాయి. వాటిపైన అట్టివే మరొక వరుస ఆమలకములున్నాయి. వాటిపై వున్నాయి పైకప్పు రాతి పలకలు. ఈ ఆమలకములకు మధ్యగల సందులలో చక్కని నాట్య శిల్పాలు వున్నాయి. దాదాపు పై కప్పులోపలిభాగమంతాను, దానికి ఆధారంగా వున్న దూలాలూ కూడా చిత్రించబడి వున్నాయి.

దేవాలయం హాలు నలుచదురంగా వుంది. దాని చివరగల స్తంభాలపై దర్శనీయమైన శిల్పాలెన్నో



గండశిల తూర్పు కొనమున్న లింగం

వున్నాయి. హాలుకి నాలుగుపక్కలా స్తంభాలుగల వరండాలు వున్నాయి. హాలుద్వారం మిక్కిలి దర్శనీయ మైనది. దాని పక్కలను, పైనగల దూలాలకు పైన యిత్తడి తొడుగు వుంది. దానిపై చక్కని శిల్పాలు చెక్కబడినవి. ఈ ద్వారాని కిరు పక్కలనూ, తూర్పు పశ్చిమాలనూగల గోడలపై వుబ్బెత్తుచిత్రాలు మలచబడినవి. అవిసిరుతొండ నాయనర్, తదితరులకథలను తెలియచేస్తున్నవి. ఈహాలుకు మూడు వైపుల 7 'ఆలయాలున్నాయి. 1. రెండు స్తంభాల మధ్యనున్న గణపతి ఆలయం. ఇక్కడ సోమ సూత్రంపై చక్కని గణపతి విగ్రహం వుంది. 2. పాపవినాశేశ్వరాలయం. ఇక్కడ ద్వార బంధం పైన ఆరు చేతులు గల చక్కని శివవిగ్రహం చెక్కబడివుంది. 3. పార్వతి ఆలయం. 4 వీరభద్రాలయం. దీనికి ఒక ప్రవేశ మార్గం, సన్నటి ముందర గది, సెల్లావున్నాయి. 5. భద్రకాళి ఆలయం 6 లోపల వేదిపై లింగం గల ఆలయం. 7. విష్ణ్వాలయం. దీనికి మండపము, ముందరిగది, సెల్లా వున్నాయి. ఈ మండపం నాలుగు స్తంభాలపైన, పైకప్పు అడుగు భాగాన చక్కని చితాౄలు వున్నాయి.



కల్యాణ మండపస్తంభంపైగల గణపతి

## శిల్పాలు

వీరభద్ర దేవాలయంలో మిక్కిలి దర్శనీయమైన శిల్పా లెన్నో వున్నాయి. వాటిలో ముఖ్యమైనవి దిగువ యివ్వబడినవి.

రెండవ ఆవరణ వాయవ్యదిశలో గల మండపం స్తంభాలపై వీరభద్రస్వామి, గణపతి, చంద్రశేఖర స్వామి, కాళీయదమన, యోగ నరసింహుడు, నృత్త - గణపతి, వీణా పాణియైన కిన్నరి విగ్రహాలు వున్నాయి.

దేవాలయం హాలు ద్వారం కవచంపై దిగువ ముఖ్యమైన శిల్పాలున్నాయి,

1. గణపతి: కూర్చునివున్న యీ దేవునిపైకుడి చేతిలో అక్షమాల, పై యెడమ చేతిలో పాశము, క్రింది కుడిచేతిలో దంతము, క్రింది యెడమ చేతిలో మోదకము (కుండ్రము) వున్నాయి. తొండం ముందర చుట్టుకొని వుంది. దాని కొనను మోదకం వుంది.



హాలు స్తంభంపై నటరాజస్వామి

2. భైరవుడు: ఈ దేవుడు పాదాలు రెండూ యెడమ రెపురువైశలలో వుంచేట్లు మణములు రెండూ దగ్గరగా వుంచి నిలుచుని వున్నాడు. ఆయనకు నాలుగుచేతులున్నాయి. పై కుడిచేతిలో ఢమరు, పై యెడమ చేతిలో నాగము, క్రింది కుడిచేతిలో ఖడ్గము, క్రింది యెడమచేతిలో పాత్ర వున్నాయి. దిగువన రెండు పక్కలా కుక్కలు వున్నాయి.

3. కుమారస్వామి: అయన ఒక కాలి మీద మరొక కాలువేసుకుని నిలుచుని వున్నాడు. వెనుక

పైపున నెమలి, యెడమ అగ్రాన లేడి వున్నాయి. కుడిచేతిలో ఈటె వుంది, ఎడమచేయి కట్యావలంబితగా వుంది.



హాలు స్తంభంపై గజాసురసంహారమూర్తి

4. వీరభద్రస్వామి: ఈయన యెడమ కాలును స్వల్పంగా వంచి నిలుచుని వున్నాడు. ఈయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడి చేతిలో యీటె, పై యెడమ చేతిలో విల్లు, క్రింది కుడి చేతిలో ఖడ్గము, క్రింది యెడమ చేతిలో తీగతో వ్రేలాడే పుర్రె వున్నాయి. ఆయన కుడివైపున దిగువ దక్షుడు అంజలి ఘటించి వున్నాడు.



నాట్యమండప స్తంభంపై నటరాజస్వామి

5. నటరాజస్వామి: అపస్మార పురుషునిపై నిలుచుని వున్న యీయన మామూలుగా భుజంగత్రాసిత భంగిమలో వున్నాడు

6. ఒక దేవుడు తనయెడమ కాలిని స్వల్పంగా వంచి నిలుచుని వున్నాడు. ఈయనకు 6 చేతులు వున్నాయి. పై కుడిచేతులలో త్రిశూలము. శంఖము (?) వున్నాయి, పై యెడమ చేతులలో మృగము, మరొక వస్తువు వున్నాయి. క్రింది యెడమ చేతిలో కమండలం వుంది. క్రింది కుడి చేయి ఒక కుక్కకి పైన వుంది.



7. వేదిపైగలలింగాన్ని కౌగలించుకున్న మార్కండేయుడు.

నాట్యమండప స్తంభంపై శిల్పం

8. ఎనిమిది చేతులుగలిగి కూర్చుని వున్న దుర్గ. దిగువన నంది, సింహము వున్నాయి.



నాట్యమండప స్తంభంపై భిక్షాటనమూర్తి

9. ఆలింగన భంగిమలో కూర్చుని వున్న శివ పార్వతులు.

10. వీణ వాయిస్తున్న సరస్వతి.

11. మహిషా సుర మర్దని.

12. గజలక్ష్మి.

13. విష్ణుమూర్తి దశావతారాలు.



కల్యాణ మండప స్తంభంపై శిల్పం

హాలు స్తంభాలపై దిగువ శిల్పాలు వున్నాయి :

1. గజాసుర సంహారమూర్తి : స్వామి గజాసురుని తలపై కుడికాలు మోపి నిలుచునివున్నాడు. గజాసురుడు సగంమనిషిగాను, సగం ఏనుగగాను వున్నాడు. ఎడమకాలు భుజంగత్రాసిత భంగిమలో వుంది. ఆయనకు ఆరు చేతులు వున్నాయి. ఒక పై కుడిచేయి తల పైకి యెత్తబడివుంది. మరొక చేతిలో తాడుతో వేలాడేఢమరు వుంది. ఒక పై యెడమ చేయి తల పైకి యెత్తబడివుంది. మరొక దానిలో అగ్నిశిఖవుంది. క్రింది కుడిచేయి అభయముద్రలోవుంది. క్రింది యెడమచేయి కరిహస్తంలో పురముపై వుంది.

2. నటరాజస్వామి : స్వామి కుడికాలు మోకాటి వద్ద మునిగివుంది. అది అపస్మారపురుషుని పిరుదులపై మోపివుంది. ఎడమకాలు మునిగివుండి అపస్మార పురుషుని తలపై మోపివుంది. ఆయనకు నాలుగు



నాట్య మండప స్తంభంపై శిల్పం

చేతులువున్నాయి. పై కుడిచేతిలో త్రిశూలము, పై ఎడమచేతిలో అగ్నిశిఖ, క్రింది కుడిచేతిలో పరశువు, క్రింది యెడమచేతిలో విల్లు వున్నాయి. శిరస్సుపై జటామకుటం వుంది. దానిమధ్య గంగ వుంది. చెన్న వీర, మోకాళ్లవరకూ వేలాడే హారాలతో అలంకృతుడై వున్నాడు.



మరొక శిల్పం

3. గణపతి : ఈయన నాట్యభంగిమలో వున్నాడు. కుడికాలు మోకాటివద్ద ముణిగి భూమిమీద మోపబడింది. ఎడమకాలు మోకాటివద్ద వంగివుండి పైకెత్తివుంధి. ఈయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో అంకుశంవుంది. పై ఎడమచేయి కరిహస్తంలో కుడివైపుకు చాచివుంది. క్రింది కుడి, యెడమ చేతులలో దంతంవుంది. మూతికిరుపక్కలా దంతాలు వున్నాయి. తొండంముందర చుట్టుకుని వుంది.



కల్యాణ మండపం మరొక స్తంభంపై శిల్పం

4. నటరాజస్వామి : స్వామి కుడికాలు అపస్మార పురుషుని పిరుదులపైనా, యెడమకాలు అతని తల పైనా వున్నాయి. ఆయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేయి మోచేతివద్ద ముణిగివుంది. చేతిలో పరశువువుంది. పై యెడమచేతిలో అగ్నిశిఖ వుంది. క్రింది రెండు చేతులలోను అపస్మారపురుషుని దేహంలోకి శూలం గ్రుచ్చబడుతున్నది.

5. యముడు మార్కండేయుడిని తీసుకుపోతానని భయపెడుతున్నాడు. మార్కండేయుడు వేదిపైగల లింగాన్ని కౌగలించుకున్నాడు. 6. దుర్గ, 7. మహిషాసుర మర్దని.

కల్యాణ మండపం స్తంభాలపై దిగువ శిల్పాలు వున్నాయి.

1. కాళ్లు స్వల్పంగా వంచి నిలుచున్న దేవుడు. ఆయనకు రెండు కాళ్లు, నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో పతాకము, పై యెడమచేతిలో కాడతోనున్న తామరపువ్వు వున్నాయి. క్రింది కుడి చేయి అభయముద్రలోను, క్రింది ఎడమచేయి వరద ముద్రలోను వున్నాయి. అడుగున ఒక మేక వుంది.

2. గణపతి : ఈయన యెడమకాలును స్వల్పంగా మునిచి నిలుచున్నాడు. ఈయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో పరశువు, పై ఎడమ చేతిలో పాశము, క్రింది కుడిచేతిలో దంతము వున్నాయి. క్రింది యెడమచేయి కట్యవలంబితగా వుంది.



అక్కడే మరొక స్తంభంపై గల శిల్పం

3. యముడు : ఈయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో గద, పై యెడమచేతిలో పాశము వున్నాయి. క్రింది రెండు చేతులు అభయ, వరద ముద్రలలో వున్నాయి.

4. బ్రహ్మ : ఈయనకు గెడ్డం వుంది. కుడిచేతిలో కమండలం వుంది. యెడమచేయి వరదముద్రలో వుంది.

5. గెడ్డంగల దేవుడు. ఈయన కుడిచేతిలో పద్మముకుంది. ఎడమచేయి కట్యవలంబితంగా వుంది.



కల్యాణ మండపం మరొక స్తంభంపై గల పంచముఖ దైవము

6. మూడు తలలు నాలుగు చేతులుగల దేవుడు.

7. పై రెండు చేతులతోను పాశాన్ని పట్టుకొని, క్రింది రెండు చేతులను అభయ, వరదముద్రలలో వుంచిన దేవుడు.

8. విష్ణుమూర్తి: ఈయన పై కుడిచేతిలో చక్రము, పై యెడమచేతిలో శంఖము వున్నాయి. దిగువ రెండు చేతులు అభయ, వరద ముద్రలలో వున్నాయి

9. పై కుడిచేతిలో గద, పై యెడమ చేతిలో ధ్వజము పట్టుకుని క్రింద రెండు చేతులను అభయ, వరద ముద్రలలో వుంచిన దేవుడు.

10. కుడిచేతిలో పద్మం పట్టుకుని యెడమచేతిని కిందికి వ్రేలాడ వేసుకుని వున్న దేవత.

11. ఎడమ చేతిలో తామర మొగ్గను పట్టుకుని కుడిచేతిని అభయముద్రలో వుంచిన దేవుడు.

12. పై కుడిచేతిలో కుంతము, పై యెడమ చేతిలో ఖడ్గము పట్టుకుని క్రింది రెండు చేతులను అభయ, వరద ముద్రలలో వుంచిన దేవుడు.

13. కుడిచేతితో తంబూరాను పట్టుకుని, యెడమ చేతిని అభయ ముద్రలో వుంచిన దేవుడు.

14. పై కుడిచేతిలో పరశువును, పై యెడమ చేతిలో త్రిశూలమును పట్టుకుని, క్రింది రెండు చేతులను అభయ, వరద ముద్రలలో వుంచిన శివుడు.

15. నాలుగు కుడిచేతులలోను చక్రం, యీటె, నాగము, ఢమరు గలిగి, నాలుగు యెడమ చేతులలోను శంఖం, ధనుస్సు, త్రిశూలము, పరశువు గలిగిన పంచముఖుడు.



అక్కడే మరొక స్తంభంపై గల దైవ విగ్రహం

16. పార్వతీ పరిణయము : శివుడు మధ్యలో వున్నాడు. ఆయన పైకుడిచేతిలో పరశువు, పై యెడమ చేతిలో మృగము వున్నాయి. ఆయన క్రింది కుడిచేయి అభయ ముద్రలో వుంది. క్రింది

యెడమ చేతితో పార్వతి కుడిచేతిని పట్టుకున్నాడు. పార్వతి శివుని యెడను వైపున నిలుచుని తన కుడి చేతితో ఆయన క్రింది యెడమ చేతిని పట్టుకుంది. ఆమె యెడమ చేతిలో రెండువైపులా పద్మంగల కాండం వుంది. బ్రహ్మదేవుడు శివుని కుడివైపున నిలుచున్నాడు.

17. పై కుడిచేతిలో పరశువు, పై యెడమ చేతిలో మృగముగల శివుడు.

18. కుడిచేతిలో నల్ల కలువను ధరించి యెడమ చేతిని క్రిందికి వ్రేలాడ వేసుకున్న అంబ.

19. కుడిచేతిలో పుచ్చకాయ కమండలం గలిగి, యెడమ చేతిని వరద ముద్రలో వుంచిన పురుషుడు.

20. ఇంద్రుడు : ఈయనపై కుడిచేతులు రెండిటిలోను వజ్రం వుంది. క్రింది చేతులు అభయ, వరద ముద్రలలో వున్నాయి.

నాట్యమండపంలోని 70 స్తంభాలలోను చాల వాటిమీద పెద్దవో, చిన్నవో యేవోరకం శిల్పాలు వున్నాయి. వాటిలో మిక్కిలి ముఖ్యమైనవి యివి :

1. పై కుడిచేతిలో ఢమరు, పై యెడమచేతిలో త్రిశూలము కలిగి క్రింది రెండు చేతులతోను మృదంగం వాయిస్తున్న పంచముఖ మూర్తి.

2. సరస్వతీదేవి : ఈమెకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో పద్మము, పై యెడమ చేతిలో పుస్తకము, క్రింది కుడిచేతిలో అక్షమాల, క్రింది యెడమ చేతిలో వీణ వున్నాయి, నిలువుగా పట్టుకొనబడిన వీణ ఆమె యెడమ భుజానికి ఆనుకుని వుంది.



హాలులో వున్న లోహపు ప్రతిమలు

3. నటరాజస్వామి : ఈయన యెడమ కాలును స్వల్పంగా ముణిచి అపస్మార పురుషునిపై వేసి నిలుచుని వున్నాడు. కుడికాలు భుజంగ త్రాసిత భంగిమలో యెడమ వైపుకి వచ్చిఉంది. ఈయనపై కుడిచేతిలో ఢమరు, పై యెడమ చేతిలో అగ్నిశిఖ వున్నాయి. క్రింది కుడిచేయి అభయ ముద్రలో వుంది. క్రింది యెడమచేయి కరిహస్తంలో శరము పై వుంది. మెడలో మోకాళ్ల వరకూ వ్రేలాడే పుర్రెల దండ వుంది.



చిత్రం — వేట దృశ్యం

4. తుంబురుడు : ఇతని ముఖం అశ్వముఖం. ఇతడు మృదంగం వాయిస్తున్నాడు.

5. కుడిచేతిలో వీణపట్టుకుని, యెడమ చేతిని క్రిందకు వ్రేలాడ వేసుకున్న దేవుడు.

6. త్రిశిర చతుర్భుజ బ్రహ్మ: ఈయన క్రింది రెండు చేతులతోను తాళాలు వాయిస్తున్నాడు.

7. కుడి చేత్తో మృదంగం వాయిస్తూ యెడమ చేతిని విస్మయంలో పైకి యెత్తిన దేవుడు.



చిత్రం—అలంకరణ

8. భిక్షాటనమూర్తి: పాంగుకలమీద నిలుచుని వున్నాడు. కుడికాలు మోకాటి వద్ద స్వల్పంగా వంగివుంది. ఎడమకాలు నిటారుగా వుంది. పై కుడి చేతిలో ఢమరు వుంది. పై ఎడమ చేతిలో గల కర్ర భుజాలమీద వుంది. క్రింది కుడి చేయి లేడికి ఆహారం పెడుతున్నది. క్రింది యెడమ చేతిలో విల్లువుంది. ఆయన యెడమ వైపున ఒక పురుషుడు నిలుచుని వున్నాడు. అతని నెత్తిపై నిండా పళ్లుగల గంపవుంది. ఒక స్త్రీ ఆ పళ్ల మీద యేదో పెడుతున్నది.



చిత్రం—శివతాండవం

9. ఎడమ చేతితో మృదంగం పట్టుకుని, కుడి చేతితో దానిని వాయిస్తున్న పురుషుడు.

10. రెండు చేతులతోను మృదంగం వాయించే పురుషుడు.



చిత్రం—వృషభారూఢ మూర్తి



చిత్రం—భిక్షాటన మూర్తి



చిత్రం—శివుడు

11. నటరాజస్వామి: ఎడమకాలు అపస్మార పురుషునిపై వేసి నిలుచుని వున్నాడు. కుడికాలు మోకాటివద్ద వంగి అయిమూలగా పైకి యెత్తివుంది. పైకుడి చేతిలో ధనువు, పై యెడమ చేతిలో అగ్ని శిఖ వున్నాయి. క్రింది కుడిచేయి అభయ ముద్రలో వుంది. క్రింది యెడమచేయి వరద ముద్రలో వుంది. అరి చేయి కోపలకు తిరిగి వుంది.

నంది: లేపాక్షి బసవయ్య అని ప్రసిద్ధికెక్కిన నంది గ్రామానికి ఈశాన్య దిశలో వుంది. ఇది యేకరాతిలో మలచబడింది. దాని పరిమాణం 19 అ × 30 అ. వుంది. అది యెంతో హుందాగా ఠీవిగా వుంటుంది.

## విగ్రహాలు

వీరభద్ర దేవాలయంలో దిగువ విగ్రహాలు వున్నాయి.

1. వీరభద్రుడు: సమభంగంలో నిలుచుని వున్నాడు. పైకుడిచేతిలో అంబు వుంది. పై యెడమ చేతిలో ధనుస్సువుంది. క్రింది కుడిచేతిలో ఖడ్గము, క్రింది యెడమచేతిలో కపాలము వున్నాయి. కపాలానికి తీగవుంది.

2. భద్రకాళి: ఈమె పై కుడిచేతిలో ధ్వజము, పై యెడమచేతిలో ధనస్సు, క్రింది కుడిచేతిలో త్రిశూలము వున్నాయి. క్రింది యెడమచేయి వరద ముద్రలోవుంది. క్రింది యెడమ అరచేతిలో యేదో గుండ్రని వస్తువుంది.

3. పద్మ పీఠంపై కూర్చున్న దేవుడు. ఈయన యెడమకాలు ముడిచివుంది. కుడికాలు క్రిందికి వ్రేలాడుతున్నది. కుడిచేతిలో కత్తి, యెడమ చేతిలో డాలు వున్నాయి.



కల్యాణమండప స్తంభంపైగల దైవము

4. వీరభద్రుడు, భద్రకాళి: రెండు లోహపు విగ్రహాలు వున్నాయి. వీరభద్రుడు యెడమకాలు ముడుచుకుని, కుడికాలు వ్రేలాడ వేసుకుని కూర్చున్నాడు. ఆయనకు 8 చేతులు వున్నాయి. కుడి చేతులలో పాశము. పాత్ర, ధనస్సు, ఖేతవున్నాయి. భద్రకాళి కూడా అలాగే కూర్చుని వుంది. నాలుగు కుడిచేతులలోను ఖట్వాంగము, త్రిశూలము, ఢమరు, ఖడ్గము వున్నాయి. నాలుగు ఎడమ చేతుల లోను అగ్నిశిఖ, గద, శూలము, ఖేతవున్నాయి.

## చిత్రాలు

లేపాక్షి దేవాలయం కుడ్య చిత్రాలకు ప్రసిద్ధి. నాట్యమండపం పోలుద్వారం చుట్టూగల స్తంభాల వరండా, విష్ణ్వాలయం, వీరభద్ర దేవాలయం పోలుల మిద్దెలోపలి భాగాలలో యీ చిత్రాలు వున్నాయి. పురాతత్వ శాఖ యీ చిత్రాలు చాల వాటికి బూజు దులిపి శుభ్రం చేస్తున్నది.



కల్యాణ మండపం స్తంభాలపై బ్రహ్మవిష్ణులు

ఇక్కడగల అనేకమైన చిత్రాలలో ఆరింటిని దిగువ వర్ణిస్తున్నాను :—

1. వేటదృశ్యము : ఎడమవైపున యెత్తుగావున్న స్థలంపై కొందరు మనుషులు నిల్చుని అడవి పంది వేటను తిలకిస్తున్నారు. కుడి వైపున ముగ్గురు పురుషులు వున్నారు. వారిలో అడవి పందిని తరుముకుని వెళ్లే విలుకాడు కూడా వున్నాడు. వారి ముందున్న ఒకపురుషుడు పరిగెత్తే జంతువుపై బాణాన్ని గురి చూస్తున్నాడు.

2. అలంకరణ : వస్త్ర భూషణాలతో అలంకృతమైన స్త్రీ కుడిచివర కూర్చుని, అద్దంలో తన సౌందర్యాన్ని చూసుకొని మురుస్తున్నది. ఆమె వెనుక చాలమంది స్త్రీలు, ఆమె చెలికత్తెలు కాబోలు, వున్నారు.

3. వృషభారూఢ మూర్తి : మధ్యభాగంలో శివ పార్వతులు వృషభంపై అధి వసించి వున్నారు. వెనుక ఛత్రం పట్టుకొని ఒక సేవకుడు నిలబడి వున్నాడు. అతని వెనక త్రిశిర బ్రహ్మ, నందికేశ్వరుడు నిలచి వున్నారు. ఒక వ్యక్తి వృషభం ముందు నేలపై సాగిలపడి వున్నాడు. మరొక వ్యక్తి శివునికి అంజలి ఘటించి నిలచి వున్నాడు.

4. నాట్యశివుడు : మధ్యభాగంలో శివుడు తాండవ మాడుతున్నాడు. ఎడమవైపున యిద్దరు, కుడివైపున నలుగురు వ్యక్తులు అంజలి బద్ధులై వున్నారు.



అక్కడే మరొక స్తంభంపై బ్రహ్మ

5. భిక్షాటన మూర్తి : ఎడమవైపున అష్టభుజియైన శివుడు త్రిభంగిలో వున్నాడు. పై యెడమ చేతులు రెండిటిలో ఢమరు, ధనుస్సు వున్నాయి. మిగిలిన చేతులు క్రిందికి వ్రేలాడు తున్నాయి. పై కుడిచేతులు రెండిటిలో త్రిశూలము, మరొక చేతిలో కపాలము వున్నాయి. క్రింది కుడిచేతిలో పాత్రవుంది. క్రింది యెడమచేయి మోచేతివద్ద వంగి

వుంది. అరచేయి పైకి తిరిగివుంది, మెడలో మోకాళ్ల వరకూ వ్రేలాడే పుఱ్ఱెలదండ వుంది. కుడివైపుక దిగువ ఒక కుక్క, కపాలాన్ని చూసి మొరుగుతున్నది. ముగ్గురు భక్తులు, బహుశా విరూపన్న, మరొక పురుషుడు, స్త్రీ, కుడి చివర నిలుచుని వున్నారు.

6. శివుడు : మధ్యభాగంలో శివుడు వున్నాడు. ఆయనపై యెడమ చేతిలో మృగము, పైకుడి చేతిలో పరశువు వున్నాయి. క్రింది యెడమచేయి క్రింద దేనినో చూపిస్తున్నది. క్రింది కుడిచేయి ఒక పురుషుని నుంచి దేనినో స్వీకరిస్తున్నది. ఒక పురుషుడు శివుని కుడివైపు నుంచి చూస్తూ ఆయనకు యేదో యిస్తున్నాడు. అతని వెనుక ఒక స్త్రీ వున్నది. నంది యీ పురుషునికి, శివునికిమధ్య వెనకకాళ్లపై నిలబడి వుండి, శివునికి యివ్వబడే వస్తువును తొంగి చూస్తున్నది. కుడి చివర మరొక జంట వుంది.





హైదరాబాదులో ప్రభుత్వ సాంకేతిక కళాశాలలో హైడ్రాలిక్ లేబొరేటరీ

# రాష్ట్రంలో సాంకేతిక విద్యా సౌకర్యాల విస్తరణ

ఇటీవల సంవత్సరాలలో సాంకేతిక విద్యా రంగంలో అభివృద్ధి శీఘ్రంగా సాగుతున్నది. ప్రణాళిక, ప్రాజెక్టుల అమలుకు అవసరమైన హెచ్చుమంది సాంకేతిక నిపుణులను, నిపుణులైన పనివారిని తయారు చేయుటకై యీ రంగంలో అనేక విస్తరణ పథకాలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమిష్టిగా పెట్టుబడి పెడుతున్నవి; ప్రణాళికేతరమైన పథకాలు కూడా ఉన్నాయి. ఇవి, ప్రణాళికా పథకాలతో కలిసి యేకీకృతమైన రాష్ట్రం అవసరాలను తీర్చగలవని భావించబడుతున్నది.

సాంకేతిక విద్యాశాఖ పారిశ్రామిక సంస్థలను, సర్టిఫికెట్టు, డిప్లమో, డిగ్రీ స్థాయిలలో నిర్వహిస్తుంది సాంకేతిక, వృత్తి విద్యారంగాలలోను, తత్సంబంధమైన యితర శాఖలలోను సౌకర్యాల హెచ్చింపుకై తీసుకోవలసిన చర్యలను గురించి అది ప్రభుత్వానికి సలహాయిస్తుంది పూర్తివికాసం చెందిన డైరెక్టరేటు ఒకటి ఉంది. ఆ శాఖకు అధిపతి డైరెక్టరు. ఈ శాఖ పూర్వపు హైదరాబాదు ప్రభుత్వంలో

కూడా వుండేది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణతో పరిశ్రమలు, వాణిజ్యశాఖ, డి. పి. ఐ. ల క్రింద గల పూర్వపు ఆంధ్ర ప్రభుత్వ సాంకేతిక సంస్థలు యీ శాఖ పరిపాలనక్రిందకు వచ్చినవి.

పూర్వపు సమిష్టి హైదరాబాదు రాష్ట్ర సాంకేతిక విద్యయొక్క తొలి పంచవర్ష ప్రణాళికక్రింద చాల పాఠశాలలు పునర్వ్యవస్థీకరింపబడినవి. నాలుగు కొత్త సంస్థలు నెలకొల్పబడినవి. అవి యివి: 1. ప్రభుత్వ సంగీత, నాట్య పాఠశాల, హైద్రాబాదు. 2. మగపిల్లల సాంకేతిక విద్యా వున్నత పాఠశాల, సికిందరాబాదు, 3. గృహశాస్త్ర శిక్షణా కళాశాల, హైదరాబాదు, 4. కేంద్ర చేతిపనుల సంస్థ, హైదరాబాదు. ప్రణాళికా పథకాలపై నిర్ణీతమైన ఖర్చు రూ. 29.61 లక్షలు కాగా రూ. 12.67 లక్షలు ఖర్చు పెట్టబడినవి. ప్రణాళికా పథకాలు కాని వాటిపై, కేంద్ర మంత్రిత్వశాఖలతో కలిసి, ప్రణాళికాకాలం సమాప్తినాటికి రూ. 5.72 లక్షలు ఖర్చు పెట్టబడినవి. ఈ విధంగా తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో చేపట్టబడిన అభివృద్ధి పథకాల మొత్తం ఖర్చు రూ. 18.39 లక్షలు అని చెప్పవచ్చు.

1955-56 లో అఖలభారత ప్రమాణాల ననుసరించి వివిధ స్థాయిలలో సాంకేతిక విద్య అభివృద్ధికై చాల సౌకర్యాలు చేయబడినవి. అవి యివి: సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ మున్నగు ఇంజనీరింగు వివిధ శాఖలలో అజమాయిషీ సిబ్బంది శిక్షణకై ఇంజనీరింగులో నేషనల్ సర్టిఫికెట్టు కోర్సులు, కార్మిక మంత్రిత్వశాఖ నిర్ణయించిన నిపుణులైన చేతిపనివారి శిక్షణకై 2 సంవత్సరాల క్రాఫ్టు కోర్సులు అవలంబింపబడినవి. వరంగల్లు, ఔరంగాబాదు, గుల్బర్గాలలో మూడు ప్రాంతీయ పాలీటెక్నిక్ సంస్థలు నెలకొల్పబడినవి. ఇక్కడ నేషనల్ సర్టిఫికెట్టు ప్రమాణం సివిల్ ఇంజనీరింగులో 3 సంవత్సరాల పోస్టు మెట్రిక్ డిప్లమో కోర్సుకి వసతి కల్పించబడింది. ఈ పాలీటెక్నిక్ సంస్థలకు, హైదరాబాదులోని ప్రభుత్వ సాంకేతిక కళాశాలకు నాలుగు ఓవర్సీర్ల ట్రేడు ట్రైనింగు కేంద్రాలు అనుబంధించబడినవి. వీటిలో మొత్తం 250 మందికి ప్రవేశం దొరుకుతుంది. నిజామాబాదు, నాందేడు, రాయచూరులలోని మగపిల్లల సాంకేతిక విద్యా వున్నత పాఠశాలలు మగవారి సాంకేతిక శిక్షణా కేంద్రాలుగా మార్చబడినవి. వాటిలో నిపుణులైన చేతిపనివారి శిక్షణకై 2 సంవత్సరాల క్రాఫ్టు కోర్సులకు సౌకర్యం కల్పించబడింది. హైదరాబాదు, సికిందరాబాదు, వరంగల్లు, ఔరంగాబాదు, గుల్బర్గాలలోని బాలికల వృత్తి విద్యా వున్నత పాఠశాలల పేర్లు బాలికల వృత్తి విద్యా సంస్థలుగా మార్చబడినవి.

విద్యావంతులలో నిరుద్యోగాన్ని తొలగించుటకై పి. డబ్ల్యు. డి. కి అవసరమైన నిపుణులైన పని వారికి 10 నెలల స్వల్పకాలిక కోర్సులో శిక్షణ యిచ్చే పథకం యీ సంస్థలు అయిదింటిలో 16-12-55 నుంచి ప్రవేశ పెట్టబడింది. ఈ పథకం క్రింద చాల వ్యాపారాలలో 275 మందికి శిక్షణ యివ్వబడింది. శిక్షితులకు శిక్షణ కాలంలో నెలకు రూ. 30/- స్టైపెండు యివ్వబడింది.

కేంద్ర ప్రభుత్వ సహాయం క్రింద చేపట్టబడిన అభివృద్ధి ప్రాజెక్టు క్రింద ప్రభుత్వ సాంకేతిక కళాశాలకు పరికరాలు సమకూర్చ బడినవి. భవనాలు విస్తరింప చేయబడినవి. ప్రైవేటు సాంకేతిక, సాంస్కృతిక (పరీక్షకు తర్ఫీదు) సంస్థలకు గ్రాంట్సు యిన్ యెయిడ్ నిమిత్తం యీ శాఖకు యిచ్చిన అదనపు సొమ్ము రూ. 50,000 నుంచి, యీ రంగంలో ప్రైవేటు సంస్థలకు ప్రోత్సాహాన్నిచ్చుటకై 18 సంస్థలకు గ్రాంట్లు యివ్వబడినవి. పూర్వపు సమష్టి హైదరాబాదు రాష్ట్రంలోని 19 ప్రభుత్వ సాంకేతిక, వృత్తి విద్యాసంస్థలలోను 1955-56 లో 3,412 మంది విద్యార్థులు చేరారు. 1954-55 లో యీ సంఖ్య 3,156.

తెలంగాణా ప్రాంతంలో 12 సాంకేతిక, వృత్తి విద్యాసంస్థలు వున్నాయి. వివరాలు యివి:

1. ప్రభుత్వ సాంకేతిక కళాశాల, హైదరాబాదు,
2. గృహశాస్త్ర శిక్షణాకళాశాల, ,,
3. ప్రభుత్వ వాణిజ్య కళాశాల, ,,
4. ప్రభుత్వ లలితకళల కళాశాల, ,,
5. కేంద్ర చేతిపనుల సంస్థ, ,,

6. బాలుల సాంకేతిక విద్యా
వున్నత పాఠశాల, సికిందరాబాదు.
7. బాలికల వృత్తి విద్యాసంస్థ, హైదరాబాదు.
8. బాలికల వృత్తి విద్యాసంస్థ, సికిందరాబాదు.
9. ప్రభుత్వ సంగీత నాట్య
పాఠశాల, హైదరాబాదు.
10. వరంగల్లు పాలీటెక్నిక్, వరంగల్లు.
11. బాలికల వృత్తి విద్యాసంస్థ, ,,
12. సాంకేతిక శిక్షణా కేంద్రం, నిజామాబాదు.

తెలంగాణా ప్రాంతంలో వున్నదిగువ ప్రైవేటు సాంకేతిక, వృత్తి విద్యాసంస్థలకు 1955-56 లో అందుకు సంబంధించిన కేటాయింపులనుంచి గ్రాంట్సు యిన్ ఎయిడ్ యివ్వబడినవి :-

### సాంకేతిక విద్యాసంస్థలు (పరీక్షకై తర్ఫీదు యిచ్చేవి)

1. బాలుల పారిశ్రామిక పాఠశాల,
ఖడిమూల్ ముస్లిమీన్, హైదరాబాదు.
2. సెయింట్ జోసెఫ్ బాలుల
పారిశ్రామిక పాఠశాల, ఖమ్మంమెట్టు.
3. విక్టోరియా మెమోరియల్
హోం బాలబాలికల పారి
శ్రామిక పాఠశాల, సరూర్
నగరం, హైదరాబాదు.
4. సెయింట్ ఫ్రాన్సిస్ బాలికల
పారిశ్రామిక పాఠశాల, సికిందరాబాదు.
5. వివేకవర్ధనీ విద్యాసంఘం సాంకే
తిక విద్యాపాఠశాల, హైదరాబాదు.
6. సర్వోదయాస్ట్రిస్టు, శివరాం
పల్లి, ,,
7. అన్వరులుల్లం వాణిజ్యపాఠశాల, ,,
8. మహబూబ్ వాణిజ్య కాలేజీ
స్కూలు, సికిందరాబాదు.
9. అల్లాడీన్ సాంకేతిక విద్యా సంస్థ, హైదరాబాదు.
10. మార్క్సు బాయ్స్ టౌన్ సంస్థ ,,

### సాంస్కృతిక సంస్థలు (పరీక్షకై తర్ఫీదు యిచ్చేవి)

11. కాకతీయ కళాసమితి వరంగల్లు
12. గాన కళాకేంద్రం, హైదరాబాదు.
13. విద్యానగర్ అసోసియేషన్
సంగీత పాఠశాల ,,
14. విజయ లలిత కళల సమితి ,,

### సాంస్కృతిక సంస్థలు (పరీక్షకై తర్ఫీదు నివ్వనివి)

15. హైదరాబాదు నాట్య నాటక
సంగీత అకాడమీ హైదరాబాదు.
16. శ్రీ త్యాగరాజ గానసభ సికిందరాబాదు.
17. హైదరాబాదు కళాకారుల
(సంగీత) సంఘం హైదరాబాదు.
18. త్యాగరాజ ఆరాధన మహో
త్సవ సభ యెల్లందు.
19. నవ కళాకేంద్రం ఆల్వాల్.
20. హైదరాబాదు సంగీత నాట్య
అకాడమీ హైదరాబాదు.
21. సాధన సంఘం ,,
22. శ్రీకృష్ణ గానసభ ,,
23. జనతా లలిత కళామండలి సూర్యాపేట.

### ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

తెలంగాణా ప్రాంతంలో సాంకేతిక విద్య ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు మొత్తం రూ. 71.678 లక్షలు. ఇందులో దిగువ యేడు పథకాలు వున్నాయి.

# ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

తెలంగాణా ప్రాంతంలో సాంకేతిక విద్య ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఖర్చు మొత్తం రూ. 71,678 లక్షలు. ఇందులో దిగువ యేడు పథకాలు వున్నాయి :—

| పథకం పేరు | సంక్షిప్త వివరణ | ప్రణాళిక సొమ్ము (లక్షల రూపాయలలో) |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 1. వరంగల్లు పాలిటెక్నిక్ సంస్థ అభివృద్ధి – అదనపు సిబ్బంది, పరికరాల సేకరణ, భవనాలు, షెడ్డుల నిర్మాణం. | నేషనల్ సర్టిఫికెట్టు ప్రమాణంలో మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగులలో డిప్లమో కోర్సులు ప్రారంభింపబడవలసి వున్నది. ఒక్కొక్కదానిలో 30 మందికి ప్రవేశం వుంటుంది. పరికరాలకు, భవనాలకు అయ్యే పథకం ఖర్చు (ఒక్కసారే జరిగేది)లో మూడోవంతును విద్యా మంత్రిత్వశాఖ భరిస్తుంది. | 17.17 |
| 2. ప్రభుత్వ సాంకేతిక విద్యా కళాశాల – మిగతా పరికరాల సేకరణ, మల్లేపల్లి ప్రాంతంలో కొత్త భవనం నిర్మాణం. | దక్షిణ ప్రాంతీయ కమిటీ సిఫార్సుల ననుసరించి సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్, ఆటోమొబైల్ ఇంజనీరింగులు నాలుగింటిలో డిప్లమో కోర్సులకి అవసరమైన సాధన సంపత్తి పూర్తిగా సమకూర్చబడుతుంది. వాటిలో 200 మందికి ప్రవేశం వుంటుంది. పరికరాలకు అయ్యే పథకం ఖర్చు (ఒక్కసారే జరిగేది) లో మూడోవంతును విద్యామంత్రిత్వశాఖ భరిస్తుంది. | 10.25 |
| 3. కార్మిక మంత్రిత్వ శాఖ పథకాల క్రింద నిపుణులైన చేతిపనివారి శిక్షణకై సౌకర్యాల విస్తరణ. | నిపుణులైన చేతిపనివారి కొరత తీవ్రంగా వున్నది. దీనిని తగ్గించుటకై ప్రస్తుతపు సంస్థలలో రెండవ షిఫ్టును ప్రవేశ పెట్టాలి. ఆ సంస్థలు యివి: హైదరాబాదులోని కేంద్ర చేతి పనుల సంస్థ. నిజామాబాదులోని ప్రభుత్వ సాంకేతిక శిక్షణా కేంద్రం. నిజామాబాదులోని జి. టి. టి. సి. లో కొత్త వ్యాపారాలను ప్రవేశ పెట్టవలసివున్నది. వరంగల్లులో కొత్తగా ఒక సాంకేతిక శిక్షణా కేంద్రం ప్రారంభింప బడుతుంది. ప్రణాళిక మూడవ సంవత్సరం నాటికి చేతిపని వారి శిక్షణకై అదనంగా 584 స్థానాలను, అప్రెంటీసు షిప్పుల శిక్షణకై 75 స్థానాల యేర్పాటును చేయవలసి వుంది. మళ్లీ మళ్లీ అయ్యేఖర్చును, ఒక్కసారి జరిగే ఖర్చునుకూడా కార్మిక మంత్రిత్వ శాఖ రాష్ట్రప్రభుత్వంతో 60 : 40 నిష్పత్తిలో పంచుకుంటుంది. | 34.468 |

| 1 | 2 | 3 |
|---|---|---|
| 4. పరిపాలన - సాంకేతిక విద్య - అదనపు మినిస్టీరియల్ సిబ్బంది, అత్యావసర ఖర్చులు, పరికరాలు. ప్రభుత్వ సాంకేతిక పరిషులు, గ్రాంట్స్ యిన్ ఎయిడ్ లకు అదనపు వసతి. గెజిటెడ్ ఇనస్పెక్టర్లు, స్టేట్ సాంకేతిక విద్య, శిక్షణల బోర్డుని యామకం. | | 3.88 |
| ·5. నానావిధ పథకాలు—— 1. ప్రభుత్వ లలితకళల కళాశాల - దంతం మినియేచర్ పై యింటింగు, పరికరాల సేకరణ. 2. హైదరాబాదులోని ప్రభుత్వ సంగీత, నాట్య పాఠశాల శాఖను సికిందరాబాదులో నెలకొల్పుట. | సికిందరాబాదులో నెలకొల్పబడే ప్రభుత్వ సంగీత, నాట్య పాఠశాల, హైదరాబాదు, శాఖలో కర్నాటక గాత్రం, కర్ణాటక వాద్య సంగీతం (వీణ, ఫిడేలు) లోను, భరత నాట్యంలోను 3 సంవత్సరాల సంగీత భూషణ సర్టిఫికెట్టు కోర్సులు, 60 మందిని చేర్చుకునే అవకాశంతో, ప్రారంభింప బడతాయి. | 1.47 |
| 6. హైదరాబాదులోనిగృహశాస్త్ర శిక్షణా కళాశాల అభివృద్ధి : 1. అదనపు గృహశాస్త్ర సహాయకుడు, పరికరాలు. 2. వసతి గృహ భవనం నిర్మాణం. దానిని నడపుటకై సిబ్బంది, పరికరాలు. | | 2.17 |
| 7. విద్యార్థి వేతనాలకు వసతి. | సాంకేతిక, వృత్తి విద్యాకోర్సులలో ప్రవేశించుటకు విద్యార్థులను ప్రోత్సహించుటకై బర్సరీలను, విద్యార్థి వేతనాలను హెచ్చు స్కేళ్లలో యివ్వడం యీ పథకం ఆశయం. | 2.25 |

రాష్ట్రంలో పబ్లిక్ వర్క్సు, స్థానిక ప్రభుత్వ శాఖలకు, పరిశ్రమలకు కూడా అవసరమైన అజమాయిషీ సిబ్బంది (ఇంజనీరింగులో) కి శిక్షణ యివ్వడం ప్రణాళిక ప్రధానాశయం. ఈ సిబ్బంది వివిధ జాతి - నిర్మాణ ప్రాజెక్టుల అమలుకు, పబ్లిక్, ప్రైవేటు రంగాలలో పరిశ్రమలను నడుపుటకు తోడ్పడ గలరు. ద్వితీయ ప్రణాళిక సమాప్తి నాటికి, తెలంగాణా ప్రాంతంలోని వివిధ సాంకేతిక, వృత్తి విద్యా సంస్థలలో చేర్చుకొనబడే విద్యార్థుల సంఖ్య యించుమించు 910 కి పెంచ బడుతుంది.

పైన చెప్పిన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పథకాలు కాక గనుల త్రవ్వకం ఇంజనీరింగులో డిగ్రీ, డిప్లమోస్థాయిలలో శిక్షణా సౌకర్యాలను తక్షణం విస్తరించ వలసిన అవసరాన్ని గురించి కేంద్ర ప్రభుత్వం పరిశీలిస్తున్నది. గనుల త్రవ్వకం సర్వేయర్లు, ఓవర్ మెన్‌ల శిక్షణకై గనుల తవ్వకం ఇంజనీరింగులో నేషనల్ సర్టిఫికెట్టు ప్రమాణంలో పోస్టు-మెట్రిక్ డిప్లమోకోర్సులను ప్రారంభించుటకై కొత్తగూడెంలో గనుల త్రవ్వకం సంస్థ స్థాపనను ఆమోదించింది. ఈ పథకానికి, ప్రణాళికా కాలంలో రూ 11.52 లక్షలు ఖర్చు కాగలదని భావించ బడుతున్నది. ఈ సంస్థ 1957 జూన్-జూలైతో ఆరంభమయే విద్యా సంవత్సరం నుంచి ప్రారంభమయింది,

ఆంధ్ర ప్రదేశ్‌లో డిగ్రీలు, డిప్లమోలు కలసాంకేతిక సిబ్బంది యెంత వున్నదో ఆ సిబ్బంది అవసరం యెంతో అన్న విషయం యిటీవల సమగ్రంగా పరిశీలించబడింది. ఒక్క సివిలు ఇంజనీరింగులోనే యేటా, డిగ్రీలు కలవారు యించు మించు 400 మంది, డిప్లమోలు కలవారు 400 మంది కొరతగా వున్నట్టు తేలింది యీ పరిశీలన వల్ల. రెండుపాలిటెక్నిక్ సంస్థలను ఒక ఇంజనీరింగు కళాశాలను, తెలంగాణా ప్రాంతంలో వరంగల్లులో, తక్షణం నెలకొల్పడం ఆవసరమని భావించబడింది. మూడు పుక్కు మిల్లుల స్థాపన, నాగార్జున సాగర్ ప్రాజెక్టు మున్నగు వాటివల్ల అవసరం కాగలదని భావించ బడుతున్న సిబ్బందిని తయారు చేయుటకై, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలకు పైన మరికొన్ని పాలిటెక్నిక్ సంస్థలను నెలకొల్ప వలసిన అగత్యాన్ని గురించి ప్లానింగ్ కమిషన్ నియమించిన ఇంజనీరింగు సిబ్బంది కమిటీ కూడా నొక్కి చెప్పింది. ప్రైవేటు విభాగంలో, 1956-57 విద్యా సంవత్సరం నుంచి మహబూబు నగరంలో ఒక టెక్నికల్ కాలేజీ తెరువ బడింది. ఇందులో 80 మంది విద్యార్థులకు ప్రవేశం లభిస్తుంది. ఇక్కడ సివిలు ఇంజనీరింగులో నేషనల్ సర్టిఫికెట్టు ప్రమాణం డిప్లమో కోర్సుకి వసతి వుంటుంది.

1957-58 విద్యా సంవత్సరంనుంచి ప్రైవేటు రంగంలో మరొక పాలిటెక్నిక్ తెరువబడింది. అదే హైదరాబాదు పాలిటెక్నిక్. ఇక్కడ మొత్తం 120 స్థానాలున్నాయి. వాటిలో 60 సివిలు, 30 ఎలక్ట్రికల్, 30 మెకానికల్ ఇంజనీరింగు కోర్సులకు వుద్దేశించ బడ్డాయి.

ఆంధ్ర ప్రాంతంలో పరిస్థితి తెలంగాణా ప్రాంతపు పరిస్థితి కంటె భిన్నంగా వుండేది. ఆంధ్రలోని పాలిటెక్నిక్ సంస్థలన్నీ పరిశ్రమలు, వాణిజ్య శాఖ డైరెక్టరు అధ్వర్యంలో వుండగా, ఇంజనీరింగు కళాశాలలు డి. పి. ఐ. అధ్వర్యంలో వుండేవి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణతో, యీ సంస్థలన్నీ యేకంగా యీ శాఖ అధ్వర్యం క్రిందకు వచ్చాయి. ఎందువల్లనంటే పూర్వ ఆంధ్ర ప్రభుత్వంలో యిట్టిశాఖ యేదీలేదు.

ఆంధ్ర ప్రాంతంలో కేవలం కేంద్ర ప్రభుత్వంచే, వుద్యోగ, పునరావాస ప్రాంతీయ డైరెక్టరు ద్వారా నిర్వహింపబడే పారిశ్రామిక శిక్షణా సంస్థలు కొన్ని వుండేవి. ఈ సంస్థలను 1956 జూన్‌నుంచి బదిలీ చేయాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. తత్ఫలితంగా, ఆ సంస్థలు కూడా యీ శాఖ అధ్వర్యం క్రిందికి వచ్చాయి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతంలో దిగువ పనులు తలపెట్ట బడినవి :

1. అనంతపురం, కాకినాడలలోని ఇంజనీరింగు కళాశాలల అభివృద్ధి - కొత్త కళాశాలా భవనం, వసతి గృహాల నిర్మాణం.

2. విశాఖపట్నంలో పాలిటెక్నిక్ స్థాపన.

3. తిరుపతిలో పాలిటెక్నిక్ స్థాపన.

4. కాకినాడలోని ఆంధ్రా పాలిటెక్నిక్ సంస్థ అభివృద్ధి.

5. వుయ్యూరు పాలిటెక్నిక్ సంస్థ అభివృద్ధి.

6. అనంతపురం ఇంజనీరింగు కళాశాలలో డిప్లమో తరగతుల అభివృద్ధి.

7. కాకినాడ ఇంజనీరింగు కళాశాలలో టెలి — కమ్యూనికేషన్ కోర్సు ప్రారంభం.

8. కాకినాడ, అనంతపురం ఇంజనీరింగు కళాశాలల్లో ప్రిప్రొఫెషనల్ కోర్సుల ప్రారంభం.

9. గూడూరులో గనుల త్రవ్వకం సంస్థ స్థాపన.

10. నిపుణులైన చేతిపని వారి శిక్షణా సౌకర్యాల విస్తరణ

ఎ. వైజాగ్‌లో ఐ. టి. ఐ, స్థాపన

బి. నెల్లూరులో ఐ. టి. ఐ. స్థాపన

సి. ప్రస్తుతం కాకినాడ, అనంతపురం, వుయ్యూరులలో గల 3 ఐ, టి. ఐ. ల అభివృద్ధి

11. సెలెక్టెడ్ పాలీ టెక్నిక్ విస్తరణ

i ఎ. పి. టి., కాకినాడ

ii వైజాగ్ పాలీ టెక్నిక్

ప్రణాళికలో నిర్ణయమైనప్రకారం విశాఖపట్నంలో ఒక పాలీ టెక్నిక్ సంస్థ ప్రారంభింపబడింది. ఇక్కడ సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగులలో డిప్లమో కోర్సులకు వసతివుంటుంది; 1956-57 లో 100 మంది విద్యార్థులు చేర్చుకోబడతారు. ఉయ్యూరు, కాకినాడ (ఆంధ్ర పాలీ టెక్నిక్, కాకినాడ) పాలీ టెక్నిక్ సంస్థలలో అదనపు పరికరాల సేకరణ ద్వారా అవి మరికొంత అభివృద్ధి పరుపబడినవి. తిరుపతిలో ఒక పాలీ టెక్నిక్ ప్రారంభింపబడుతున్నది. ఇందులో 1957 జూలై నుంచి 100 మంది విద్యార్థులకు సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగులలో డిప్లమో కోర్సులకు వసతివుంటుంది. నిపుణులైన చేతిపని వారికి విస్తృత శిక్షణా సౌకర్యాల పథకం క్రింద, ప్రస్తుతపు సంస్థలలో జరిగే సంవత్సరంలో 242 స్థానాలను అదనంగా సమకూర్చాలి; ఆ పైన దిగువ కొత్త సంస్థలను ప్రారంభించాలి.

1. విశాఖపట్నం, నెల్లూరు (లేక గూడూరు) లలో 2 పారిశ్రామిక శిక్షణా సంస్థలస్థాపన.

అనంతపురం, కాకినాడ, వాల్తేరు విశ్వవిద్యాలయ ఇంజనీరింగు కళాశాలలకు అనుబంధింపబడిన పాలీ టెక్నిక్‌లు ప్రణాళిక ననుసరించి అభివృద్ధి చేయబడినవి.

పై ప్రణాళికా పథకాలు కాక, సాంకేతిక విద్య అఖిల భారత కౌన్సిలు యిటీవల ఇంజనీరింగులో వివిధ డిగ్రీ, డిప్లమో కోర్సులలో చేర్చుకొనే విద్యార్థుల సంఖ్యను 20 శాతం హెచ్చించుటకు ఆమోదించింది. అదిగాక, ఆంధ్రప్రదేశ్‌లో పాలీ టెక్నిక్ సంస్థల విస్తరణ పథకాన్ని కూడా ఆమోదించిందిఅది. అందులో దిగువ మూడు సంస్థలు చేరి వున్నాయి.

1. ప్రభుత్వ సాంకేతిక కళాశాల, హైదరాబాదు.

2. ఆంధ్ర పాలీ టెక్నిక్, కాకినాడ

3. విశాఖపట్నం పాలీ టెక్నిక్, విశాఖపట్నం

పై చర్యలు, ప్రణాళికా కార్యక్రమంతో కలిసి ప్రణాళిక సమాప్తి నాటికి ఇంజనీరింగు డిగ్రీ, డిప్లమో కోర్సులలో చేర్చుకొనే విద్యార్థుల సంఖ్య హెచ్చుటకు తోడ్పడుతాయి. 1955—56 లో డిగ్రీ కోర్సులలో చేర్చు కొనబడే వారి సంఖ్య 400. ఇది ప్రణాళిక సమాప్తి నాటికి 575 కి హెచ్చుతుంది. ఇంజనీరింగు మూల శాఖలు మూడింటిలోను (సివిల్, మెకా

నికల్, ఎలక్ట్రికల్) డిప్లమో కోర్సులలో చేర్చుకొనబడే వారి సంఖ్య 600 నుంచి 1250 కి హెచ్చుతుంది. ఇది గాక ఆటో మొబైలు టెలికమ్యూనికేషన్లు, ఫిషరీస్ టెక్నాలజీ, నావిగేషన్, గనుల త్రవ్వకం మున్నగు యితర ఇంజనీరింగు డిప్లమో కోర్సులలో మరి 200 మంది చేర్చుకోబడుతారు. బొగ్గుతోను, బొగ్గు లేకుండాను గనులు త్రవ్వే పనిలో అజమాయిషీ సిబ్బంది శిక్షణకై కొత్తగూడెం, గూడూరులలో రెండు గనుల త్రవ్వకం సంస్థల స్థాపనను కేంద్ర ప్రభుత్వం యిటీవలనే మంజూరుచేసింది. అలాగే ప్రణాళికా కాలం సమాప్తి నాటికి నిపుణులైన చేతిపని వారి స్థానాలు 1254 నుంచి 2712 కి హెచ్చించబడతాయి. ప్రైవేటు రంగంలో, హైదరాబాదులో 1957 జూలై నుంచి శ్రీ, మిర్, అక్బర్ అలీఖాన్, బార్ యెట్లా, విరాళంతో ఒక పాలీ టెక్నిక్ ప్రారంభించబడింది. అక్కడ సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ ఇంజనీరింగులలో డిప్లమో కోర్సులలో 100 మందికి వసతివుంటుంది.

ప్రణాళిక, ప్రణాళికేతర పథకాల క్రింద, వివిధ స్థాయిలలో సాంకేతిక విద్యా సౌకర్యాల విస్తరణకు తీసుకున్న చర్యల వల్ల ఆంధ్రప్రదేశ్ మూలావసరాలకు సరిపడ సిబ్బంది సమకూరగలదు.





మూసీ ప్రాజెక్టు : కుడి కాలువ

# సాగునీటి పారుదలకు హెచ్చు సౌకర్యాలు

అధికాహారోత్పత్తి చాలమటుక్కు అధికమైన నీటి పారుదల సౌకర్యాలపై ఆధారపడి వుంటుంది. మన రాష్ట్రంలో 6 భారీ నీటి పారుదల ప్రాజెక్టులు చాలా భాగం పూర్తికాగా మరి రెండు పూర్తి అవుతున్నవి. మరి రెండు చురుకుగా పరిశోధించ బడుతున్నవి. పెక్కు మధ్యరకం, చిన్నరకం పథకాలు, వరద నివారణ పథకాల విషయంలో కూడా పని జరుగుతున్నది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద వరద నివారణకు ఋణ సహాయానికై రూ 3 కోట్లు ఆమోదించ బడినవి. 1955-56 నుంచి యింత వరకూ రూ 63,25,000 మంజూరు చేయబడినవి. 1958-59 బడ్జెట్‌లో రూ 51 లక్షలు కేటాయించ బడినవి. కేంద్ర ప్రభుత్వంచే యింతవరకూ రూ 46 లక్షల అప్పు మంజూరు చేయబడింది. అయినా యీ సంవత్సరం సహాయాన్ని కనీసం ఒకకోటి రూపాయలకు పెంచించమని కేంద్ర ప్రభుత్వానికి వ్రాయడం జరిగింది.

ప్రస్తుతం దాదాపు 20 వరద నివారణ పథకాలు అమలు జరుగుతున్నాయి. వాటిలో ముఖ్యమైనవి యివి :

1. బుడమేరు మళ్లింపు పథకం.
2. తూర్పు తుంగభద్ర మురుగు పారుదల పథకం.
3. సీతానగరంనుంచి వైకుంఠపురం వరకూ వరద గట్లు.

4. బుడమేరు వరదగట్ల పథకాలు.

5. ఏనుగుపల్లి వరదగట్టు 2/4 నుంచి వైనతేయం యెడమ వరదగట్టు 5/ 4-5 మై. వరకూ వరదగట్టు నిర్మాణం.

కేంద్ర ప్రభుత్వం కనుక అడిగిన అప్పును యిచ్చి నట్లయితే, 1959 ఆఖరునాటికి యీ పనులు పూర్తి కాగలవని ఆశించ బడుతున్నది.

తెలంగాణాలో వరదల వల్ల దెబ్బతినే గ్రామాల వివరాలు సేకరించ బడుతున్నాయి. అవసరమైనచో తెల్లా వరదగట్లు నిర్మించబడ గలవు.

## భారీ నీటిపారుదల పథకాలు

దిగువ పథకాలు ఆంధ్రలో తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రారంభించబడి యిప్పుడు ద్వితీయ ప్రణాళిక క్రింద మిగిలిపోయిన పనులుగా కొనసాగు తున్నవి.

1. కృష్ణా బ్యారేజ్.
2. రొంపేరు ప్రాజెక్టు.
3. భైరవానితిప్ప ప్రాజెక్టు.
4. ఎగువ పెన్నారు ప్రాజెక్టు.
5. రాళ్లపాడు ప్రాజెక్టు.
6. తుంగభద్ర దిగువ కాలువ.

ఇవి దాదాపు పూర్తిఅయినవి. వాటిలో కొన్ని యిదివరకే పూర్తి అయినవి. అందువల్ల అదనంగా 44,229 యెకరాలు ఆయకట్టు వైశాల్యంలో చేరినవి. ఈ సంవత్సరం యింకా యెక్కువ పథకాలను చేపట్టుటకు చీఫ్ ఇంజనీర్లకు అధికారం యివ్వబడింది. ఇందువల్ల అదనంగా 25,000 యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది. మధ్య పెన్నారు రెగ్యులేటర్ పని చేపట్ట బడింది. ద్వితీయ ప్రణాళిక క్రింద యెగువ కాలువ పథకం మంజూరు చేయబడు తుందన్న భావంతో యిది చేపట్ట బడింది. ప్రాథమిక చర్యలు దాదాపు పూర్తి అయినవి. షట్టర్ల తయారీకి అవసరమైన ఉక్కు కొరత యీ పథకాల పూర్తికి ఒక పెద్ద ఆటంకంగా వున్నది. ఆంధ్రప్రదేశ్ కి త్వరితంగా వుక్కు సరఫరా చేయడానికిగల అవకాశాలను గురించి ఇనుము, వుక్కు కంట్రోలరుతో మాట్లాడుటకై ఒక ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు కలకత్తాకు పంపబడ్డాడు. కాలవలకు నీరు ఒదలడానికి ప్రత్యామ్నాయ యేర్పాట్లు చేయడానికి కూడా చర్య తీసుకొన బడింది.

తెలంగాణాలో భారీ నీటి పారుదల పథకాలైన కడం, మూసీ ప్రాజెక్టులు చేపట్ట బడినవి. మొదటిది పూర్తి అయింది. కాని ఆగస్టు 31 వ. తేదీ వరదతో అది బాగా చెడిపోయింది. రెండవది 1959-60 నాటికి పూర్తి అవుతుంది. రాజోలిబండ పథకం అమలు జరుగు తున్నది. ఇది పూర్తిఅయి, ఆయకట్టు పూర్తిగా అభివృద్ధి అయిననాడు లక్ష టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా పండ గలవని భావించ బడు తున్నది.

మరొక ముఖ్యమైన ప్రాజెక్టు కర్నూలు - కడప కాలవ. దీని విషయంలో బాగా పనిజరుగు తున్నది. 1956-57 లో 1,575 క్యూసెక్కులు, 1957-58 లో 1,857 క్యూసెక్కులు నీరు ప్రవహించింది. ఈ పథకం క్రింద 1956-57 లో ప్రథమ పంట క్రింద 87,156 యెకరాలకు నీటి పారుదల లభించింది. 1957-58 లో 11,106 యెకరాలకి లభించింది. దీనితో నీటి పారుదల పొందిన భూమి 23,911 యెకరాలు హెచ్చింది. 1956-57 లో రెండవపంట క్రింద 5,374 యెకరాలకు 1957-58 లో 9,291 యెకరాలకు నీటి పారుదల లభించింది. దీనితో నీటి పారుదల పొందిన భూమి 3,917 యెకరాలు హెచ్చింది. తూముల బాగు, దిగువ ప్రాంతాలలో కాలువను వెడల్పు చేయుటకు పంపిణీ, పంటకాలు వలవసతులకై వచ్చే రెండు సంవత్సరాలలోను రూ. 2 కోట్లు అప్పుగా యిమ్మని కేంద్రప్రభుత్వాన్ని కోరడం జరిగింది, ఇందువల్ల వచ్చే మూడు సంవత్సరాలలోను 2 లక్షల యెకరాలు నీటి పారుదల క్రిందకు వస్తాయి. మరొక లక్ష టన్నుల ఆహార ధాన్యాలు అదనంగా పండుతాయి.

రెండు భారీ నీటి పారుదల ప్రాజెక్టులు అనగా వంశధార, గోదావరి మరుకుగా పరిశీలించ బడు తున్నాయి.

## వంశధారా ప్రాజెక్టు

ఈ ప్రాజెక్టును ఆంధ్రప్రదేశ్, ఒరిస్సారాష్ట్రాలు కలిసి నిర్మించవలసి వున్నది. అది యీ రెండు రాష్ట్రాలకు వుపయుక్తం కాగలదు. దీని విషయంలో సింగిడి, మదన్‌పురం, గొట్టలవద్ద విపుల పరిశోధనలు జరుప బడినవి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గొట్ట వద్ద జలాశయాన్ని నిర్మించ వచ్చునని 1956 జూలైలో భువనేశ్వర్‌లో జరిగిన వుభయ ప్రభుత్వ ప్రతినిధుల సమావేశంలో అంగీకరించ బడింది. గొట్ట జలాశయం వల్ల విస్తారం జనసంఖ్యగల సారవంతమైన విశాల ప్రదేశము, 22,000 యెకరాల వరి, చెఱకు పొలాలు మునిగి పోగలవని శ్రీకాకుళం జిల్లా రైతులు యీ దశలో ప్రభుత్వానికి చాల విజ్ఞప్తులను పంపారు. దానిపై కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమిషన్ సభ్యులు ఆంధ్రప్రదేశ్ స్పెషల్ చీఫ్ ఇంజనీరుతో కలసి ఆ స్థలాలను తిరిగి తనిఖీచేసి తగిన ప్రత్యామ్నాయంగా గుడారి గ్రామాన్ని యెంచారు. ఈ స్థలం ఆంధ్ర ప్రదేశ్ సిబ్బందిచే కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమిషన్ అధ్వర్యాన పరిశోధించ బడుతున్నది. ఈ పని 1959 జూన్ నాటికి పూర్తికావచ్చు. వంశధారా ప్రాజెక్టుకి రూ 7.5 కోట్లు ఖర్చుకాగలదని అంచనా. దీనిక్రింద మొత్తం 3.1 లక్షల యెకరాలకు నీటి పారుదల లభిస్తుంది.

## గోదావరి ప్రాజెక్టు

గోదావరి దక్షిణ భారతదేశం నదులలో కెల్లా మిక్కిలి పెద్దది. ఇందులో యేటా 2,500 టి.ఎమ్-ఘ.అ. నీరు లభిస్తుంది. ఈ నీటిలో చాలభాగం బంగాళాఖాతంలో కలిసి వృధా అయిపోతున్నది. ప్రస్తుతపు ప్రాజెక్టులు, పోచంపాడుకి పైన గోదావరి వుపనదులపై తలపెట్టబడిన ప్రాజెక్టులు కలిపి 326 టి.ఎమ్-ఘ.అ. లను మించి వుపయోగించుకోవు.

ఎగువ బేసిన్‌లో గల ప్రవాహాన్నంతటినీ వుపయోగించుకొనుటకై, ఆదిలాబాదు జిల్లాలోని పోచంపాడు గ్రామం వద్ద ఒక ఆనకట్టను నిర్మించాలని సంకల్పించబడింది. ఆనకట్ట నదీ గర్భానికి 113 అ. యెత్తున వుంటుంది. దానివల్ల యేర్పడిన జలాశయం 125 టి. ఎమ్-ఘ అ. నీటిని నిల్వచేస్తుంది. జలాశయానికి యిరువైపులా రెండుకాలువలు త్రవ్వబడగలవు.

ఉత్తర కాలువ కడం నది చిన్న జలాశయంలో కలువగా దక్షిణ కాలువ పోచంపాడు ప్రాజెక్టు ప్రధాన భాగం కాగలదు. అది నిజామాబాదు, కరీంనగరం, వరంగల్లు, ఖమ్మం, నల్గొండజిల్లాల గుండా ప్రవహించి నిజాంసాగర్ కాలువ సిస్టంతో కలుస్తుంది. ఈ కాలువ మొత్తం పొడుగు 251 మైళ్లు వుంటుంది. అది యించుమించు 17.92 లక్షల యెకరాలకి సాగునీరు లభింపచేస్తుంది. ఆనకట్టకు యించుమించు రూ. 15 కోట్లు, కాలువలకు యించుమించు రూ. 75 కోట్లు ఖర్చు కాగలదని అంచనా. ఈ ప్రాజెక్టువల్ల 25,000 కె. వా. విద్యుచ్ఛక్తి వుత్పత్తి కావచ్చు. కాలువ కుడివైపున కరీంనగరం, వరంగల్లు జిల్లాల్లోని వేలాది యెకరాల భూమికి నీటిని తోడుటకై వుపయోగించబడుతుంది. యీ విద్యుచ్ఛక్తి. ఆఖరికి పోచంపాడు ప్రాజెక్టు వల్ల యించుమించు 20 లక్షల యెకరాలకు మేలు కలుగుతుంది.

## మధ్యరకం ప్రాజెక్టులు

ఆంధ్రప్రాంతంలో 17 మధ్యరకం నీటి పారుదల ప్రాజెక్టులు పూర్తి అయినవి లేదా పూర్తి అవుతున్నవి. వీటిలో నాలుగు శ్రీకాకుళం జిల్లాలోను, మూడు నెల్లూరు జిల్లాలోను, మూడు చిత్తూరు జిల్లాలోను, రెండు కడప జిల్లాలోను, రెండు అనంతపురం జిల్లాలోను, ఒకటి కర్నూలు జిల్లాలోను, ఒకటి పశ్చిమ గోదావరి జిల్లాలోను, ఒకటి విశాఖపట్నం జిల్లాలోను. వున్నాయి.

తెలంగాణా ప్రాంతంలో యీ రకం ప్రాజెక్టులు నాలుగు వున్నవి. వాటి ఖర్చు రూ. 128.50 లక్షలు. ఇవి మొత్తం 21,660 యెకరాలకు సాగునీరు

అందించగలవు. వీటిలో రెండు పూర్తి అయినవి. మిగిలిన రెండు పూర్తి అవుతున్నవి.

## చిన్న రకం పథకాలు

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో చిన్న రకం నీటి పారుదల వసరుల అభివృద్ధికై రూ. 444 లక్షలు కేటాయించబడినవి ఇందులో రూ. 243 లక్షలు ఆంధ్రకు రూ. 201 లక్షలు తెలంగాణాకు కేటాయించబడినవి.

ఆంధ్రప్రాంతంలో అశ్రద్ధకు గురియయిన 570 చెరువులు బాగు చేయబడతాయి. ఇవి మొత్తం 49,000 ఎకరాలకు సాగునీరు లభింపచేస్తాయి. ఇవి గాక పెక్కు చిన్నరకం నీటి పారుదల పనులు, మళ్లింపు పథకాలు అమలు పరచబడతాయి. దానితో మరి 96,000 ఎకరాలకి నీటి పారుదల లభిస్తుంది.

తెలంగాణా ప్రాంతంలో, తొలి పంచవర్ష ప్రణాళిక క్రింద మంజూరైన 598 గండిపడిన చెరువుల మరమ్మతు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద కొనసాగించబడుతుంది. మొత్తం ఆయకట్టు 65,727 ఎకరాలు. ఖర్చు రూ. 106.13 లక్షలు. ఇవి 75,085 ఎకరాలకు సాగునీటిని అందిస్తాయి.

ఆంధ్రలో చిన్నరకం నీటి పారుదల పథకాలకై 1956-57 లో రూ. 16,80 లక్షలు కేటాయించబడినవి. ఈ సొమ్ము పూర్తిగా ఖర్చు చేయబడినది. తెలంగాణాకు రూ. 59.85 లక్షలు కేటాయించబడగా రూ. 25.09 లక్షలు ఖర్చు పెట్టబడినవి. 1957-58 లో ఆంధ్రకు కేటాయించబడిన రూ. 33.13 లక్షలలోను రూ. 31.19 లక్షలు ఖర్చు పెట్టబడినవి. తెలంగాణాలో రూ. 30.93 లక్షలు మంజూరు కాగా రూ. 24.78 లక్షలు ఖర్చు పెట్టబడినవి.

1958-59 లో యీ పద్దు క్రింద ఆంధ్రలో రూ. 31.89 లక్షలు. తెలంగాణాలో రూ, 50.61 లక్షలు ఖర్చు పెట్టబడగలవని భావించబడుతున్నది.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ శాఖలు :

# న్యాయ శాఖ

న్యాయశాఖ ప్రభుత్వానికి వ్యాఖ్యాలతో సహా న్యాయశాస్త్ర సంబంధమైన విషయాలలో, సలహా యిస్తుంది. ఆపైన విధానం ఆమోదించబడిన శాసనం ప్రాజెక్టులకు సాంకేతిక స్వరూపం యిస్తుంది. అలాగే ప్రభుత్వం లేక ప్రభుత్వం క్రింద అధికారులచే జారీచేయబడే లేక చేయబడిన చట్టబద్ధమైన నిబంధనలు, ప్రకటనలు, వుత్తరువులను పరిశీలించి పునర్విమర్శిస్తుంది. కోడ్‌లు, చట్టాలు, మాన్యుయల్‌లు మున్నగు న్యాయ, శాసన సంబంధమైన ప్రచురణలను అజమాయిషీ చేస్తుంది కూడా.

## సలహా

న్యాయ శాఖ దిగువ విషయాలలో సెక్రటేరియట్ పరిపాలనా వ్యవహార శాఖలకు సలహా యిస్తుంది.

1. స్టాట్యూట్సు, చట్టాలు, రెగ్యులేషన్సు, చట్టబద్ధమైన నిబంధనలు, వుత్తరువులు, ప్రకటనల నిర్మాణం;

2. ఏ సందర్భంలోనైనా వుత్పన్నమయే సర్వసాధారణమైన న్యాయ సూత్రాలు.

3. పరిపాలనా వ్యవహార శాఖలలో దేనినైనా ప్రారంభించడం లేక వుపసంహరించడం.

అడ్వొకేటు - జనరల్‌తో సంప్రదించిన సందర్భాలలో, అడ్వొకేటు - జనరల్‌కి కేసు స్టేట్‌మెంటుగల ముసాయిదా మెమోను న్యాయశాఖ తయారు చేస్తుంది. ఆపైన సాధారణంగా పరిపాలనా వ్యవహార శాఖకు, అడ్వొకేటు జనరల్‌కి మధ్య ఒకరి విషయాలొకరికి తెలియచేసే వాహికగా పని చేస్తుంది.

## పరిశీలన

చట్ట బద్ధమైన నిబంధన, ప్రకటన లేక వుత్తరువును జారీ చేయవలసి వచ్చినా లేక చట్ట బద్ధమైన అధికారం క్రింద, క్రింద అధికారులచే ఏదైనా నిబంధన, బై-లా, ప్రకటన లేక వుత్తరువు జారీ చేయబడుటకు ఆమోదం యివ్వవలసి వచ్చినా లేక కేంద్ర ప్రభుత్వంచే జారీ చేయబడుటకై ఆ ప్రభుత్వానికి చట్ట బద్ధమైన ఒక నిబంధన, ప్రకటన లేక వుత్తరువు ముసాయిదాను పంపవలసి వచ్చినా న్యాయశాఖ ఆ ముసాయిదాను పరిశీలించి దానికి తుదిరూప మిస్తుంది.

## పునః ప్రచురణ

న్యాయశాఖ రాష్ట్ర శాసనసభ శాసనాలనన్నిటిని భద్ర పరుస్తుంది. వాటిని వాటిక్రింద చేయబడిన నిబంధనలు, వుత్తరువులు, ప్రకటనలతో సహా కొన్నాళ్ల కొకసారి ప్రచురిస్తూ వుంటుంది. ఇందువల్ల యేదైనా సంశయం వచ్చినప్పుడు ప్రజలు, ప్రభుత్వ శాఖల అధికార్లూ కూడా వాటిని చూసి సులభంగా సంశయ నివారణ చేసుకో గలుగుతారు.

## ముసాయిదా రచన

ఏదైనా శాసనం చేయాలనే ప్రతిపాదన వచ్చినప్పుడు ఆ విషయాన్ని న్యాయశాఖ దిగువ అంశాల దృష్ట్యా పరిశీలిస్తుంది.

1. న్యాయ శాస్త్ర దృష్ట్యా ఆ శాసనం చేయడానికి గల అవసరం;

2. అందుకు ముందుగా ఇండియా అధ్యక్షుని ఆమోదం పొందడం అవసరమా;

3. అదిభారతరాజ్యాంగం నిబంధనలకు ముఖ్యంగా మూల హక్కులకు సంబంధించిన వాటికి అనుగుణంగా వున్నదా.

శాసనం చెయ్యాలని నిర్ణయం జరిగినట్లయితే, న్యాయశాఖ తాత్కాలిక ముసాయిదా బిల్లును తయారు చేస్తుంది. ఆశయాలు, కారణాల వివరణ పత్రాన్ని కూడా తయారు చేస్తుంది. ఆ తరువాత పరిపాలనా వ్యవహారశాఖ ఆ ముసాయిదా తాత్కాలిక బిల్లును తాను అవసరమని భావించిన అధికారులకు, సంస్థలకు చూపిస్తుంది. అటుపిమ్మట ఆ ముసాయిదా బిల్లును మంత్రుల సంఘం పరిశీలిస్తుంది. ఆ బిల్లుతో పనిజరిగించుటకు నిర్ణయించబడితే న్యాయశాఖ ఆ తాత్కాలిక ముసాయిదా బిల్లుకి తుది రూపం యిస్తుంది.

## దావాలు వగైరా

ప్రభుత్వోద్యోగులు వుద్యోగరీత్యా చేసిన పనులకై వారిపై తేబడిన దావాలు మున్నగువాటి విషయంలో ప్రభుత్వ ఖర్చుపై యిచ్చే డిఫెన్సును మంజూరు చేసే వుత్తరువులనన్నిటిని న్యాయశాఖ జారీ చేస్తుంది. దిగువ పరిపాలనా వ్యవహార విషయాలను కూడా అది చూస్తుంది,

1. స్టేట్ లారి పోర్టులు
2. అడాప్షన్
3. ఆర్బిట్రేషన్
4. బార్ కౌన్సిల్సు చట్టం
5. సాక్ష్యం, ప్రమాణాలు
6. శిశువులు, మైనరులు
7. ఆస్తిబదిలీ (వ్యవసాయ భూములు కానివి)

## చట్టాల యేకీకరణ

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో అమలులో వున్న చట్టాలను యేకం చేయుటకై అవసరమైన బిల్లులను తయారు చేసి, వాటిని రాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టి, దాని ఆమోదాన్ని పొందవలసివున్నది. ఈ బిల్లులను మూడు తరగుతులుగా విభజించవచ్చు :

1. తెలంగాణా ప్రాంతంలో అమలులో వున్న హైదరాబాదు చట్టాల వంటివి ఆంధ్ర ప్రాంతంలో కూడా అమలులో వుంటే అప్పుడు ఆ హైదరాబాదు చట్టాలను రద్దుచేసి తెలంగాణాకు కూడా ఆంధ్ర చట్టాలను వర్తింపచేయటం;

2. సూత్రం లేక విధానం ప్రశ్న వుత్పన్నం కానప్పుడు, లాంఛన ప్రాయమైన మార్పులను చేసి ఆంధ్ర చట్టాలను తెలంగాణా ప్రాంతానికి, హైదరాబాదు చట్టాలను ఆంధ్ర ప్రాంతానికి వర్తింపచేయటం;

3. ప్రస్తుతపు హైదరాబాదు, ఆంధ్ర చట్టాలను సవరించి యేకీ కృతం చేయటం.

1953 ఆంధ్ర జీతాల చెల్లింపు, అనర్హతల తొలగింపు చట్టం తగిన విధంగా సవరించబడి తెలంగాణా సభ్యులకు వర్తింప చేయబడుతున్నది. 1955 ఆంధ్ర కోర్టురుసుం, దానాల విలువ చట్టం, 1939 మద్రాసు వినోదపు పన్నుచట్టం, 1952 మద్రాసు మోటారు శకటాల (ప్రయాణీకులు, సరుకుల పన్ను విధింపు) చట్టం, 1939 మద్రాసు మోటారు స్పిరిట్ అమ్మకం పన్ను విధింపు చట్టాలు తెలంగాణా ప్రాంతానికి, అక్కడ అటువంటి చట్టాలు యేమైనా వుంటే వాటిని రద్దుపరచి, వర్తింపచేయబడుతున్నాయి. సాధారణ అమ్మకం పన్ను చట్టాలు, అత్యవసర ఖర్చులనిధి చట్టాలు విలీనం చేయబడి శాసనసభచే ఆమోదించబడినవి. మిగిలిన చట్టాల విలీనం విషయంలో పని జరుగుతున్నది.



హైదరాబాదులో నారాయణ గూడాలో గల నిరోధ వైద్య సంస్థకు అదనపు బ్లాకుకై 2.9.58 న రాష్ట్ర ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.

హైదరాబాదులో :

# నిరోధ వైద్యసంస్థ పుట్టుపూర్వోత్తరాలు

“నగరంలో మీ పాఠశాల సరీగ్గా యెక్కడ వుందీ?” అని నారాయణ గూడాలోని బాలికోన్నత పాఠశాల బాలిక నెవరినైనా అడుగుతామనుకోండి, వెంటనే యీ జవాబు వస్తుంది, “తెలియదూ ? కుక్కల ఆస్పత్రి పక్కనే”.

అయితే అక్కడ జబ్బుచేసిన కుక్కలకు మందివ్వరులెండి, కుక్కలు కరచిన మనుషులకు మందిస్తారు.

దానిని అంతా ‘కుక్కల ఆస్పత్రి’ అని పిలిచినా, దాని అసలు పేరు నిరోధ వైద్యసంస్థ, లేబొరేటరీ అయివున్నది. రాష్ట్ర ముఖ్యమంత్రి అక్కడ కొత్త బ్లాక్ కి 2.9.58 న శంకుస్థాపన చేశారు.

ఈ నిరోధ వైద్యసంస్థ యిక్కడి వైద్య, రోగ్య శాఖ మిక్కిలి పాత సంస్థలలో ఒకటి. అందులో దిగువ విభాగాలు పని చేస్తున్నాయి. 1. మశూచి టీకాల మందు తయారీ, 2. కలరా ప్రజా టీకాల మందు తయారీ, 3. జల విశ్లేషణం. 4. ఆహారం, మందుల విశ్లేషణం. 5. క్లినికోపాథోలజీ సెక్షన్. ఇందులో సెరోలజీ, హెమటాలజీ, సూక్ష్మ క్రిమి శాస్త్రము, జీవ రసాయన శాస్త్రము

మున్నగునవి వున్నాయి. 6. కుక్కకాటు చికిత్సా కేంద్రం. 7. సాంకేతిక సిబ్బంది శిక్షణ. 8. కెమికల్ ఎగ్జామినర్సు సెక్షన్.

అసలు మొదట టీకాలమందు తయారీ విభాగము, కెమికల్ ఎగ్జామినరు లేబొరేటరీ స్వతంత్రవిభాగాలుగా పనిచేస్తూ వుండేవనీ, మొదటిది అనగా టీకాల మందు తయారీ విభాగం ప్రస్తుతపు సుల్తాన్‌బజార్ ఆస్పత్రిలో వుండేదనీ, రెండవది అఫ్‌జల్ గంజ్‌లో వుండేదనీ తెలుస్తున్నది, అందుబాటులో వున్న కాగితాలవల్ల.

శైశవావస్థలో టీకాల మందు తయారీ విభాగం సీనియరు వాక్సినేటరు అధ్వర్యంలో వుండేది. మశూచికం రోగుల మశూచికం పొక్కుల రసినుంచి పిల్లలకు సరాసరి టీకాలు వేసినట్లు కాని బాహువు టీకాలు అమలులో వున్నట్టు కాని యెక్కడా నిర్దిష్టమైన సాక్ష్యంలేదు. ప్రజలలో యెక్కువభాగం టీకాలకు వ్యతిరేకులు కాగా నగరంలోని కొందరు వి. ఐ. పి. లు టీకాలు వేసిన ఆవుదూడ గిజురుతో తమ పిల్లలకు సరాసరి టీకాలు వేయాలని పట్టు పట్టేవారు. అదిబాగా పని చేస్తుందో చేయదో, దానిలో విషం విరుగు డయిందో లేదో, సూక్ష్మ క్రిములు నశించాయో లేదో మున్నగు విషయాలను కూడా వారు పట్టించుకునే వారు కాదు ఆ సందర్భంలో. అజ్ఞానులైన ప్రజా బాహుళ్యం కళాకళలకి, దురభిప్రాయాలకి గురిఅవుతూ అందుకు సంబంధించిన అధికారి క్లిష్టమైన దశలు పెక్కిటిని యెదుర్కొనవలసి వచ్చేది. పిల్లలకు మిఠాయిలు. పెద్దవారికి రొఖ్ఖం యివ్వడం వంటి చర్యలద్వారా యెంతకృషి చేసినా ప్రజలు టీకాలు వేయించుకొనుటకు యిష్టపడేవారు కాదు. పూర్వ నగర జీవితంలో టీకాలమందు తయారీ విభాగం మిక్కిలి అవాంఛనీయ మయిన అంశంగా పరిగణించ బడేది.

కెమికల్ ఎగ్జామినరు లేబొరేటరీ టీకాలమందు తయారీ విభాగకు నారాయణ గూడాలోని ప్రస్తుతపు ప్రదేశానికి 1910 లో తరలించ బడ్డాయి. డా. ఎస్. మల్లన్న సూక్ష్మ దర్శినిని వుపయోగించిన మొదటి హైదారాబాదీ అయివున్నారు. ఈయన ఇంగ్లండులో ఎమ్. డి. డిగ్రీని పొంది వచ్చారు.

ఈ సంస్థ తరువాత అభివృద్ధిని నాలుగు దశలలో సమీకరించవచ్చు. వీటిలో ఒక్కొక్క దశ 12 సంవత్సరాల పరిమాణం గలది.

## మొదటిదశ—1910-22

వాక్సీన్ డిపోకు అధ్వర్యం వహిస్తున్న వాక్సినేటరు స్థానంలో తగిన శిక్షణగలహెల్తు ఇనస్పెక్టరు నియమితుడయాడు. ఆ తరువాత కెమికల్ ఎగ్జామినరు స్వర్గీయ డా. ఎస్. మల్లన్న పరిపాలనా అధికారం క్రింద కెమికల్ ఎగ్జామినర్ లేబొరేటరీ, వాక్సీన్ డిపో కలిపి వేయబడ్డాయి.

టీకాలమందు బాగా పని చేయాలంటే దానిని మైనస్ 4 ( - 4 ) డిగ్రీలవద్ద రెఫ్రిజిరేటర్‌లో నిలవ వుంచాలి. తగిన పరికరాలు ముఖ్యంగా యీ నిలవ సౌకర్యాలు లేక దానినాణ్యం అభివృద్ధి కార్యక్రమం బాగా మందకొడిగా సాగేది.

కాబట్టి టీకాలవల్ల కలిగే ఫలితాలు అసందర్భంగా, అసంతృప్తికరంగా, ఒక్కొక్కప్పుడు అపోహలకు దారి తీసేవిగా వుండేవి.

## రెండవ దశ - 1922 - 34

నైజాం నవాబు 1334 ఫసలీ 1వ. ఫర్వార్డీ జరీదా నెం. 18 ద్వారా టీకాలను నిర్బంధం చేశారు.

లేబొరేటరీల అభివృద్ధికై ఒక పథకం మంజూరు చేయబడింది. దాని క్రింద వాక్సీన్ డిపోకు టీకాల మందు తయారీలో శిక్షణ పొందిన వైద్యాధికారి లభించాడు. నాన్-రికరింగు సొమ్ము మంజూరీతో లేబొరేటరీకి కోల్డు స్టోరేజి, విసురు యంత్రాలు మున్నగు పరికరాలు కొనడం సాధ్యమయింది. దానితో అక్కడ తయారయే టీకాల మందు నాణ్యం నిర్దిష్టంగా అభివృద్ధి చెందింది. 1930-31 లో

ప్రత్యేక శస్త్ర చికిత్స థియేటరు, మెమూరింగు స్టాల్సు నిర్మించబడ్డాయి. ఈ విభాగం అప్పుడు అవసరమైన లక్ష డోసుల టీకాల మందును తయారు చేయగలిగేది. ప్రస్తుతపు అవసరాలతో పోల్చినప్పుడు యిది చాల తక్కువగా కనబడుతుంది.

మామూలు కుక్కలు, పిచ్చికుక్కలు కరిచిన వ్యక్తుల చికిత్సకు కూడా ఒక కేంద్రం ప్రారంభించ బడింది. ఇందువల్ల ప్రభుత్వంపై వ్యక్తుల్ని తగిన చికిత్సకై కూనూరు వంటి దూరప్రదేశానికి పంప వలసిన అవసరం తప్పింది.

లేబొరేటరీ కూడా హైదరాబాదు వాటర్ వర్క్సు నుంచి వచ్చిన కొన్ని రకాల నీటిని, వుస్మానియా ఆస్పత్రి నుంచి వచ్చిన కొన్ని రకాల ఆహారాన్ని విశ్లేషించడం ఆరంభించింది. క్లినికో పాథోలజీ సెక్షన్‌లో పని కొన్ని రకాల మూత్రాల పరీక్షకు, కొన్ని పూతల సూక్ష్మ దర్శిని పరీక్షకు, పరిమితమై వుండేది.

## మూడవ దశ - 1934-45

కెమికల్ ఎగ్జామినర్ సెక్షన్ అభివృద్ధికై కృషి ప్రారంభింపబడింది. అసిస్టెంటు సర్జన్ మెడికో-లీగల్ అనాలిసిస్‌లో శిక్షణకై పంపబడ్డాడు. ప్రజారోగ్య అనలిటికల్ వర్కులో అర్హతగల వైద్యాధికారి సేవ లభ్యం చేయబడింది.

పిచ్చికుక్క కాటు చికిత్సా సౌకర్యాలను జిల్లా యూనిట్లకు విస్తరింపచేయుటకై జిల్లా సివిల్ సర్జను లందరికీ పిచ్చికుక్క కాటు చికిత్సలో శిక్షణ యివ్వబడింది.

ఈ దశ వుత్తరార్థంలో కలరా-టీకాల మందు తయారీకై ఒక పథకం అమలు పరచబడింది. టీకాల మందు విభాగాలు రెండూ కూడా హెచ్చే ప్రజావ సరాలకు సరిపడ మందును తయారు చేయ లేక పోతున్నాయని త్వరలోనే కనుగొనబడింది. క్లినికల్ పాథోలజీ సెక్షన్‌లో పని వృద్ధికానారంభించింది.

1935-37 ల మధ్య మరి కొన్ని అభివృద్ధులు జరిగినవి.

## నాలుగవ దశ

1948 లో అసిస్టెంటు డైరెక్టరు పరిపాలనా అధికారం క్రింద లేబొరేటరీ బ్యూరో ఒకటి నెల కొల్పబడింది. మరి రెండు మొదటి తరగతి పదవులు, కెమికల్ ఎగ్జామినర్ పదవి ఒకటి, పాథోలజిస్టు పదవి ఒకటి కల్పించబడినవి. అన్ని విభాగాలలోను జరిగే పని బాగా హెచ్చింది. కాని లేబొరేటరీ మాత్రం హెచ్చే ప్రజావసరాలను తీర్చలేక పోయేది.

## లేబొరేటరీ సర్వీసు విస్తరణ

ఈ సందర్భంలో యీ సంస్థ డైరెక్టరు డా. వై. నారాయణరావు రాష్ట్రంలో లేబొరేటరీ సర్వీసుల అభివృద్ధికై జరిగిన కృషిని క్లుప్తంగా వివ రించారు. ఆయన యిలా అన్నారు.

"ఆంధ్రలో కింగ్ ఇన్స్టిట్యూటు పద్ధతిలో లేబొ రేటరీని ప్రారంభించే కార్యక్రమం సమష్టి రాష్ట్రం విభజన సమయంలో ఆరంభమయింది. కింగ్ ఇన్స్టి ట్యూటు నిర్వహణ ఖర్చులో తగిన వాటాను ఆంధ్ర రాష్ట్రం భరించే పక్షంలో దాని లేబొరేటరీ అవసరా లను యెప్పటివలె ఆ సంస్థ తీర్చాలని ఆ సమయంలో విభజన సంఘం నిర్ణయించింది. ఆంధ్ర రాష్ట్రానికి అవసరమైన డైయాగ్నాస్టిక్ పరీక్షలన్నిటిని 1958 అక్టోబరుతో అంతమయ్యే అయిదు సంవత్సరాల వరకూ కింగ్ ఇన్స్టిట్యూటే జరపాలనీ, అలాగే దానికి అవసరమైన టీకాల మందులు, సేరా మున్నగు జీవ శాస్త్ర సంబంధమైన వస్తులను 1968 అక్టోబరుతో అంతమయ్యే పదిసంవత్సరాల వరకూ అది అందజేయాలనీ కూడా నిర్ణయించబడింది.

ఈ ఒప్పందం ఫలితంగా మనరాష్ట్రం మద్రాసు రాష్ట్రానికి కింగ్ ఇన్స్టిట్యూటు నిర్వహణకి సరిగ్గా అయ్యే ఖర్చులో 100 కి 36 వంతులను యివ్వవలసి వుంటుందని భావించబడుతున్నది. ఇది సగటున యించుమించు రూ. 15 లక్షలు తేలుతుంది.

ఈ విధంగా కింగ్ ఇన్స్టిట్యూటు చేసే సరఫరాలు మున్నగు వాటి నిమిత్తం మనరాష్ట్రం మద్రాసు రాష్ట్రానికి యేటా రూ. 4 లక్షలకి మించి చెల్లించుటకు ఒప్పుకున్నది.

"1955 లో ఆంధ్ర ప్రభుత్వం యించుమించు రూ, 40 లక్షల వ్యయంపై విశాఖపట్నంలో ప్రధాన లేబొరేటరీని ప్రారంభించాలని నిర్ణయించింది. విశాఖపట్నం వెళ్లి అందుబాటులో వున్న స్థలాలను భవనాలను పరిశీలించి కొత్త సంస్థ ప్రారంభానికి తగిన స్థలాన్ని యెన్నమని నన్ను కోరింది. అప్పుడు నేను కింగ్ ఇన్స్టిట్యూటు డైరెక్టరుగా వున్నాను. ఇంచుమించు 40 యెకరాల వైశాల్యం గల ప్రదేశాన్ని యెన్ని నివేదికను పంపించాను నేను. అక్కడ రెండు పెద్ద పెద్ద భవనాలు, బావులు వగైరా వున్నాయి. దీని విలువ యించుమించు రూ. 12 లక్షలు వుంటుందని నిర్ణయించింది ప్రభుత్వం. ఆ ఆస్తి సేకరణకు సంబంధించిన యేర్పాట్లు దాదాపు పూర్తి అయాయి. అప్పుడు ఆంధ్ర తెలంగాణా రాష్ట్రాల విలీనం వార్త తెలిసింది మాకు. అప్పుడు ప్లానింగు సెల్ మద్రాసులో సమావేశమై విలీనానికి తుది స్వరూపమిచ్చేవరకూ విశాఖపట్నంలో కొత్త సంస్థ ప్రారంభం ప్రతిపాదనను వాయిదా వేయాలని నిర్ణయించింది. ఈ ప్లానింగు సెల్‌లో మేజర్ కె. ఎన్. రావు, అప్పటి ప్రజారోగ్య డైరెక్టరు స్వర్గీయ డా. సుబ్బారావు, నేను సభ్యులుగా వున్నాం. కాబట్టి హైదరాబాదు వెళ్లి యీ సంస్థలో కల సౌకర్యాలను పరిశీలించమని నేను మళ్లీ కోరబడ్డాను. ఆంధ్ర ప్రభుత్వానికి నా నివేదికను 1957 ప్రారంభంలో అందజేశాను. విశాఖపట్నంలో కొత్త సంస్థను ప్రారంభించుటకు బదులు యీ సంస్థను అభివృద్ధి పరచి యిక్కడి కార్యకలాపాలను విస్తరింపచేస్తే ఆంధ్ర ప్రభుత్వానికి లాభం అని మేము నిర్ణయించాము.

"ముందుముందు లేబొరేటరీ సర్వీసుల విస్తరణకు మాకు గల పథకాలను గురించి కొంచెం చెబుతాను యిప్పుడు. వైద్య సిబ్బంది కొరతవల్ల ఆంధ్రలోనే కాక మొత్తం భారతదేశంలోనే పలు ప్రదేశాలలో తగిన వైద్య సహాయం లేదని రెండు రోజుల క్రితమే మేజర్ కె. ఎన్. రావు మీకు చెప్పారు. వైద్య సహాయం విషయమే అలావుంటే యిక లేబొరేటరీ సౌకర్యాల మాట చెప్పనే అక్కర్లేదు. అవి పల్లె ప్రాంతాలలో అసలు లేనేలేవు. పట్టణ ప్రాంతాలలో చాలా తక్కువగా వున్నాయి. గడచిన పది సంవత్సరాలలోను సమష్టి రాష్ట్రంలో ప్రాంతీయ లేబొరేటరీలను ప్రారంభించాలని మేము ప్రయత్నించాము. అట్టివి మంగుళూరు, కోయంబత్తూరు, విశాఖ పట్నాలలో ప్రారంభించాలని మేము అనుకున్నాము. కాని యీ పాత సిఫార్సులను అమలుపరచ లేక పోయామని చెప్పుటకు చింతిస్తున్నాను. అదృష్ట వశాత్తూ యిప్పుడు యీ విషయంలో మన ఆంధ్రరాష్ట్రం పరిస్థితి మెరుగ్గానే వుంది. 1957-58 లో కర్నూలు, విశాఖ పట్నాలలో రెండు, 1958-59 లో గుంటూరు వరంగల్లులలో రెండు ప్రాంతీయ లేబొరేటరీలను ప్రారంభించుటకు మనకు యిప్పుడు ప్రభుత్వామోదం వుంది. కాకినాడ, ఏలూరు, కరీంనగరం, మహబూబునగరాలలో జిల్లా లేబొరేటరీల ప్రారంభానికి కూడా ప్రభుత్వామోదాన్ని పొందాము. కాబట్టి సామాన్య మానవునికి వైద్య సహాయాన్నే కాక లేబొరేటరీ సౌకర్యాలను కూడా అందజేయడమే మా పరమావధి."



# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న : (శ్రీ బి. శేషగిరిరావు, కొత్తగూడెం)

ఆంధ్రప్రదేశ్‌లో వెనుకబడిన తరగతులు, షెడ్యూల్డుతరగతులు, షెడ్యూల్డు జాతులు యెన్ని వున్నాయి ?

జవాబు: 1951 జనాభా లెఖ్ఖల సేకరణ సందర్భంలో, దిగువ తరగతులకు మాత్రమే జనాభా లెఖ్ఖలు తయారు చేయబడినవి :

1. షెడ్యూల్డు కులాలు.
2. షెడ్యూల్డు జాతులు.
3. వెనుకబడని తరగతులు.
4. ఇతర తరగతులు.

అందుచేత ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతులు కాని వెనుకబడిన తరగతులు, లేక హరిజనుల సంఖ్యా వివరాలు విడిగా లభ్యంకావు. అయితే షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతుల మొత్తంసంఖ్యా వివరాలు మాత్రం దిగువ యివ్వబడినవి :

### 1. షెడ్యూల్డు కులాలు

| | |
|---|---|
| పురుషులు | 22,32,762 |
| స్త్రీలు | 21,73,855 |
| మొత్తం | 44,06,617 |

### 2. షెడ్యూల్డు జాతులు

| | |
|---|---|
| పురుషులు | 3,85,557 |
| స్త్రీలు | 3,81,122 |
| మొత్తం | 7,66,679 |

ప్రశ్న : (శ్రీ బి. రామిరెడ్డి, బొండుగుల పి. ఓ. భోనగిరి తాలూకా. నల్గొండ జిల్లా).

ఆంధ్రప్రదేశ్‌లో యే యే ప్రాజెక్టులు వున్నాయి ?

జవాబు: ఆంధ్రప్రదేశ్‌లో నిర్మాణంలోనున్న లేక నిర్మించాలని నిర్ణయించ బడిన నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు యివి :

1. నాగార్జున సాగర్ ప్రాజెక్టు.
2. పోచంపాడు ప్రాజెక్టు.
3. కృష్ణా బ్యారేజీ (పూర్తి అయింది).
4. తుంగభద్రా ప్రాజెక్టు. దిగువ కాలవ.
5. తుంగభద్రా ప్రాజెక్టు. ఎగువ కాలవ.
6. సోమశిల సమీపంలో పెన్నార్ ఆనకట్ట.
7. కర్నూలు - కడప కాలవ అభివృద్ధి.
8. ఖైరవాని తిప్ప ప్రాజెక్టు.
9. ఎగువ పెన్నారు ప్రాజెక్టు.
10. వంశధారా ప్రాజెక్టు,
11. పులి చింతల ప్రాజెక్టు.

12. సిద్ధేశ్వరం ప్రాజెక్టు.

13. ఇచ్చంపల్లి ప్రాజెక్టు.

ప్రశ్న : (శ్రీ బి. శేషగిరిరావు, ఆత్మకూరు)

కేంద్రమంత్రివర్గంలో యెందరు మంత్రులు వున్నారు? లోకసభ, రాజ్య సభలలో యెందరు సభ్యులు వున్నారు? రాజ్యసభ అధ్యక్ష, వుపాధ్యక్షులెవరు? కేంద్ర ప్రభుత్వంలో యెన్ని శాఖలు వున్నాయి?

జవాబు: కేంద్ర మంత్రివర్గంలో 12 మంది మంత్రులు (మంత్రివర్గ సభ్యులు), 15 మంది మినిస్టర్స్ ఆఫ్ స్టేట్, 19 మంది వుప మంత్రులు వున్నారు.

ప్రస్తుతం లోకసభ సభ్యుల సంఖ్య 505. రాజ్యసభ సభ్యుల సంఖ్య 232. ఇండియా వుపాధ్యక్షులు డా. ఎస్. రాధాకృష్ణన్ రాజ్యసభ అధ్యక్షులుగా వున్నారు. దాని వుపాధ్యక్షులు శ్రీ ఎస్. వి. కృష్ణమూర్తి రావు.

మంత్రిత్వ శాఖలు లేక కొన్ని సందర్భాలలో శాఖల పరిపాలనా అధిపతులుగా 21 మంది కార్యదర్శులు వున్నారు. ఒక్కొక్క మంత్రిత్వ శాఖ డివిజన్‌లు, వుపశాఖలు, సెక్షన్‌లుగా విభజింప బడుతుంది.

ప్రశ్న : (శ్రీ జి. లింగయ్య, మెదక్)

మనరాష్ట్రంలో ఎగువసభ ప్రయోజనం యేమిటి?

జవాబు: శాసన సభకు వచ్చిన వివిధ అధికార, అనధికార బిల్లుల సర్వ సంపూర్ణ పరిశీలనకు తోడ్పడుతుంది. అలాగే ప్రశ్నోత్తరాలు మున్నగు వాటి ద్వారా పరిపాలనకు సంబంధించిన వివిధ అంశాలను ప్రజల పరిశీలనకు తీసుకుని వచ్చుటలో కూడా అది తోడ్పడుతుంది. శాసనసభలో ప్రాతినిధ్యం లేని కొన్ని అర్హమైన తరగతుల ప్రజలకు ప్రాతినిధ్యం యిస్తుంది కూడా.

డబ్బు బిల్లుల సందర్భంలో, యెగువసభ తాను అవసరమని భావించిన మార్పుల విషయంలో, శాసనసభనుంచి బిల్లువచ్చిన 14 రోజులలోపల, సిఫార్సులను మాత్రమే చేయగలదు. ఇందువల్ల ఆసిఫార్సులను ఆమోదించుటకు లేక నిరాకరించుటకు శాసనసభకు గల స్వాతంత్ర్యానికేమి భంగంరాదు.

ప్రశ్న : (శ్రీ టి. ఆర్. కృష్ణమూర్తి, గుంటూరు)

మనదేశంలో యేటా యెంత నెయ్యి వుత్పత్తి అవుతున్నది?

జవాబు: ఇంచుమించు 103.08 మణుగులు, దీని విలువ రూ. 185 కోట్లు.

ప్రశ్న : (శ్రీ కొత్త ప్రకాశం, సదాశివపేట.)

జాతీయ విస్తరణసేవ ఆశయం యేమిటి, అది ప్రజలకు యెలా తోడ్పడుతుంది?

జవాబు: జాతీయ విస్తరణసేవలో గ్రామ సహాయకులవంటి కార్యకర్తలు వలలా అల్లుకుని పనిచేస్తారు. వీరు శాస్త్రీయ విజ్ఞానాన్ని గ్రామీణులకు అందించి తద్వారా గ్రామీణ జీవితం అభివృద్ధికి తోడ్పడుతారు. ప్రజల కృషిద్వారనే సాంఘికంగా, ఆర్థికంగా గ్రామీణ జీవితాన్ని మార్చుటకు వుద్దేశించబడిన సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని అమలుపరచే సాధనం యిది. ఈ కార్యకర్తలు రైతుల దైనందిన సమస్యల పరిష్కారానికి, మొత్తం గ్రామీణ జీవితం అభివృద్ధికి తోడ్పడుతారు.

ప్రశ్న : (శ్రీ పి. సోమసుందరరావు, భీమవరం, పశ్చిమగోదావరిజిల్లా.)

తొలి పంచవర్ష ప్రణాళిక క్రింద సాంకేతిక విద్యకై యెంతఖర్చు పెట్టబడింది,

ద్వితీయ ప్రణాళికక్రింద యెంతఖర్చు పెట్ట బడుతుంది ?

జవాబు: తొలి పంచవర్షప్రణాళిక క్రింద సమష్టి హైద్రాబాదు రాష్ట్రంలో సాంకేతిక విద్యపై మొత్తం రూ. 18.39 లక్షలు ఖర్చు పెట్టబడ్డాయి. ద్వితీయ ప్రణాళిక క్రింద దానిపై తెలంగాణాలో రూ. 71.678 లక్షలు, ఆంధ్రలో రూ. 31.823 లక్షలు ఖర్చు పెట్టబడతాయి, ఇదిగాక కొత్త గనుల త్రవ్వకం సంస్థపై రూ. 11.52 లక్షలు ఖర్చు పెట్టబడతాయి. కాబట్టి ద్వితీయ ప్రణాళిక క్రింద ఆంధ్ర ప్రదేశ్‌లో మొత్తం రూ. 115.021 లక్షలు ఖర్చుపెట్ట బడగలవు.

ప్రశ్న : (శ్రీ బి, ఎన్. మూర్తి, సికింద్రాబాదు.)

ఆచార్యవినోబా వుద్యమం ప్రభుత్వ భూసంస్కరణ పథకాలకు యేవిధంగానైనా వుపయోగపడుతుందా ?

జవాబు: ఆచార్య వినోబా భూదానోద్యమం దాని సత్ఫలితాలను వివరించుటద్వారా దాని పట్ల ప్రజలలో వుత్సాహం కలిగించి తద్వారా చట్టాలను చక్కగా అమలు పరుచుటకు తగిన వాతావరణాన్ని కల్పిస్తున్నంతవరకూ అదీ, భూసంస్కరణకై ప్రభుత్వం తీసుకునే చర్యలు పరస్పర పరిపూరకాలని చెప్పవచ్చు.





రాష్ట్ర ప్రణాళికలు, అభివృద్ధి శాఖామంత్రి (నల్గొండ జిల్లా చింతంపల్లి అభివృద్ధి కేంద్రంలో)

# జిల్లాల వార్తలు

## విశాఖపట్నం జిల్లాలో స్థానిక పరిపాలన మంత్రి

స్థానిక పరిపాలన, కార్మిక శాఖ మంత్రి శ్రీ డి. సంజీవయ్య 2-9-58న విశాఖపట్నం జిల్లా రెడ్డిపల్లి, విజయనగరాలను సందర్శించారు.

రెడ్డిపల్లిలో కొత్తగా నిర్మించబడిన పాఠశాలా భవనాన్ని ప్రారంభించారు. ఆయన. ఆ సందర్భంలో యేర్పాటైన సభకు శాసనసభ్యుడు శ్రీ రాజాసాగి సూర్యనారాయణరాజు అధ్యక్షత వహించారు. పార్లమెంటు సభ్యుడు శ్రీ ఎమ్. సూర్యనారాయణ మూర్తి పాఠశాల ఆవరణలో జాతీయ పతాకాన్ని యెగుర వేశారు

స్థానిక పనుల కార్యక్రమం క్రింద 12 వున్నత పాఠశాలా భవనాలు నిర్మింపబడాలని సంకల్పించ బడినదనీ, శ్రీ కె. పాపయ్య అవిరళ కృషిద్వారా రెడ్డిపల్లి పాఠశాలా భవనం అనుకొన్న గడువులో నిర్మించబడిందనీ చెప్పారు శ్రీ సాగి సూర్యనారాయణరాజు.

మంత్రిగారు మాట్లాడుతూ రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు వ్యవసాయోత్పత్తి పెంచుదలకై

తీవ్రంగా కృషిచేస్తున్నాయని, వ్యవసాయ దేశమైన భారతదేశం విదేశాల నుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకొనడం దయనీయమయిన విషయమని అన్నారు. ఎక్కువ పండించుటకు రైతులు శపథం తీసుకోవాలన్నారు

ఆయన యింకా మాట్లాడుతూ పంటనీటి వనరులు, మంచినీటి సౌకర్యాల తక్షణాభివృద్ధికై జిల్లా కలక్టర్లందరి అధీనంలోను రూ. 50,000 వుంచబడినవని చెప్పారు.

గ్రామాల బాగుకై ధనికులు డబ్బును, మిగిలినవారు శ్రమను యివ్వాలని అన్నారు ఆయన ప్రజలలో నిగూఢమైన శక్తి అణగి వున్నదనీ. దానిని నిర్మాణాత్మక కృషికై వినియోగించాలని అన్నారు. ప్రసంగాన్ని ముగిస్తూ ఆ పాఠశాలా బాలబాలికలు దేశానికి వుపయోగకరమైన పౌరులుగా తయారు కాగలరన్న ఆశను వెల్లడించారు.

ఆ తరుచాత ఆయన విజయనగరం వెళ్లి, అక్కడ స్థానిక సహకార అర్బాన్ బ్యాంకిని దర్శించారు.

మునిసిపలు కార్యాలయంలో బహిరంగసభ జరిగింది. పురపాలక సంఘం అధ్యక్షుడు శ్రీ అప్పన్న దొర మంత్రిగారికి స్వాగత పత్రం సమర్పించారు. పరిపాలన అన్ని స్థాయిలలోను కూడా ఖర్చును



ఆకివీడు అభివృద్ధి కేంద్రం గ్రామ శివారు పెదవుప్పరగూడెంలో బ్లాకు అభివృద్ధి ప్రాథమిక పాఠశాల ప్రారంభించబడింది.

తగ్గించాలని ప్రభుత్వం గట్టిగా కోరుతున్నదనీ, స్వాగత పత్రాలు యిచ్చే అలవాటును కనీసం స్థానిక సంస్థలలో నయినా మాని వేయాలనీ స్వాగత పత్రానికి జవాబు చెబుతూ మంత్రిగారు చెప్పారు. చర్చలు యెక్కువ లాభకరం కాగలవు. భూమి అడుగునుంచి మురుగు పారుదల పథకం విషయంలో, పురపాలక సంఘం ప్రభుత్వం నుంచి అప్పు తీసుకొని పని ప్రారంభించవచ్చునని సూచించారు.

## నల్గొండ

సమాజాభివృద్ధి కార్యక్రమంతో సంబంధంగల జిల్లా అధికారులు జిల్లా కలక్టరు శ్రీ శ్రావణ్ కుమార్, ఐ. ఏ. ఎస్.' నాయకత్వాన భోనగిరి పంచాయతీ సమితిబ్లాకులో 18-9-58న పర్యటనసలిపారు. వారు చినకందుకూరు, బొల్లేపల్లి గ్రామాలను సందర్శించి వివిధ కార్యక్రమాలను తనిఖీచేశారు. గ్రామీణులను పరిచయం చేసుకుని వారి చిక్కులనుగురించి తెలుసుకున్నారు.

ఈ జిల్లా అధికారులు రెండు వర్గాలుగా చీలారు. జిల్లా ప్లానింగు ఆఫీసరు, బ్లాకు అభివృద్ధి ఆఫీసరు మున్నగువారితో కలిసివెళ్ళి కలక్టరు చినకందుకూరు లోని వరిపొలాలను, యింటితోటలను, పెంట యెరువు గుంటలను తనిఖీచేశారు. ఆయన స్థానిక మహిళా మండలినికూడా దర్శించారు. ఆతరువాత ఆయన గ్రామీణులు చేరినచోటికివెళ్ళి వారి అభివృద్ధి కేంద్రం ప్రణాళికా కార్యక్రమాలను అమలు పరుచుటలోగల చిక్కుల్ని గురించి వివరంగా తెలుసుకున్నారు. ఉత్తమ విత్తనాలు, రసాయన యెరువులు, పచ్చియెరువునువాడి వ్యవసాయోత్పత్తిని పెచ్చించమని రైతులతో చెప్పారు. వృత్తిగా కోళ్ళను పెంచమనికూడా ఆయన సూచించారు.

మధ్యాహ్నం బ్లాకు పంచాయతీ సమితి సభ్యుల సమావేశంలో ఆయన ప్రసంగించారు. అన్ని శాఖలకు సంబంధించిన యేకీకృతమైన కార్యక్రమం అమలుకై వారికి అందచేయ బడుతుందని చెప్పారు. గ్రామీణులలో స్వయంసహాయ భావాన్ని, కార్య ప్రారంభాసక్తిని కలిగించమని కలక్టరుగారు సభ్యులను కోరారుకూడా.

ఈ సందర్భంలో శాసన సభ్యుడు శ్రీ రావి నారాయణరెడ్డి మాట్లాడుతూ, పరిపాలనలోవి కేంద్రీకరణను ప్రవేశపెట్టి ఆవిధంగా ప్రజలు తమ ప్రణాళికను స్వయంగా అమలుపరుచుకునే అవకాశం కల్పించినందుకు ప్రభుత్వానికి కృతజ్ఞత తెలిపారు. ప్రణాళికా కార్యక్రమాలను విజయవంతంగా అమలు పరుచుటకై పూర్తి సహకారాన్ని యిమ్మని ఆయన సభ్యులను కోరారు.

జిల్లా అధికారులు సమిష్టిగా పర్యటించుటను ఆయన ప్రశంసిస్తూ, గ్రామీణుల సమస్యల పరిష్కారానికి అదియెంతో తోడ్పడుతుందని అన్నారు.

## విశాఖపట్నం జిల్లాప్లానింగు కమిటీ

జిల్లా ప్లానింగు కమిటీ విశాఖపట్నంలో, 18-9-58న జిల్లా కలక్టరు అధ్యక్షతన సమావేశమయింది. కలక్టరు ప్రారంభంలో సమావేశానికి హాజరయిన సభ్యులకు, కొత్తగా యెన్నికయిన యెగువసభ సభ్యులకు స్వాగతం చెప్పారు. జిల్లాలో 35 లక్షల యెకరాల ఆయకట్టు వున్నదనీ, యితర జిల్లాల ఆయకట్టుతో పోల్చినప్పుడు యిది మిక్కిలి తక్కువఅనీ చెబుతూ, ప్రస్తుతపుపంటనీటి వనరుల అభివృద్ధికి, కొత్తపథకాల అమలుకిమార్గాలను సూచించమని ఆయన అనధికారులను అడిగారు. అనధికార సభ్యులు రెండు ముఖ్యమైన సూచనలు చేశారు. అవి యివి: 1. ప్రత్యేక పరిశోధనడివిజన్‌ను యేర్పరుచుట. 2. జిల్లాలో మూడు తాలూకాలకు వుపకరించగల గోస్తనీనది జలాలను సాగునీటి ప్రయోజనాలకై వుపయోగించుట.

## అనంతపురం ప్లానింగు కమిటీ సమావేశం

ప్లానింగు సిబ్బంది కమిటీ నెల సరి సమావేశం జిల్లా కలక్టరు కార్యాలయంలో 22-9-58 న జరిగింది. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన యిన్‌ఛార్జి జిల్లా కలక్టరు శ్రీ ఇ. జగన్నాథాచారి



గన్నవరం అభివృద్ధి కేంద్రం ఆత్కూరులో స్వర్గీయ శ్రీ ఎ. సీతారామయ్య చౌదరి గ్రామ పార్కుకి కేంద్ర సమాజాభివృద్ధిశాఖా మంత్రి శ్రీ ఎస్. కె. డే శంకుస్థాపన చేశారు.

జిల్లాలోని అభివృద్ధి కేంద్రాలన్నిటిలోను 1958 ఆగస్టువరకు స్థానికాభివృద్ధి పనులు, గ్రామ రస్తాల అభివృద్ధి కమిటీ పథకాలవంటి వివిధ అభివృద్ధి పథకాల క్రింద జరిగిన పనిని సమీక్షించారు. జాతీయ పొదుపు పథకం క్రింది వసూళ్లను హెచ్చించుటకు యింకా బాగా కృషి చేయమని అధికారు లందరినీ ఆయన కోరారు.

## గ్రామ సహాయకుల పర్యటన

శ్రీకాకుళం, విశాఖ పట్నం, తూర్పు గోదావరి జిల్లాల నక్కపల్లి, కోరుకొండ, చోడవరం, ఉర్లాం, రాజా నగరం, కోటవురట్ల, షేర్ మహమ్మద్‌పురం, కొత్తపేట, సీతాపేట, పెందుర్తి, సబ్బవరం అభివృద్ధి కేంద్రాలకు చెంది శిక్షణ పొందిన 11 మంది గ్రామ సహాయకులు పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల్లో పర్యటించారు. వారు ఒక్కొక్క జిల్లాలోను మూడేసి రోజులు గడిపారు.

వారు 3-9-58 న గుంటూరు చేరారు. 2-9-58 నుంచి 7-9-58 వరకూ మద్దిపాడు, దొడ్డవరప్పాడు, పెదుగుండ్లపాడు, సంత నూకలపాడు కొరిసెపాడు, ఎడ్లపాడు, జగ్గాపురం, తాడికొండ, అమరావతి, బాపట్ల, ఏలేరు, కోలగుట్ల, ముదితుకూరు, ఉప్పలపాడు, మంగళగిరి, అమ్మనబ్రోలు, నాదెండ్ల, కర్లపాలెం, మాచెర్ల అభివృద్ధి కేంద్రాలలో జరిగే అభివృద్ధి కార్యక్రమాలను చూశారు. లామ్ ఫారమ్, పశువుల ఫారమ్, భూమి పరీక్ష లేబొరేటరిలను బాపట్ల, నాగార్జున సాగర్ ఆనకట్టల వద్ద వ్యవసాయ క్షేత్రాలను కూడా చూశారు.

అలా వెళ్లిన గ్రామ సహాయకులు, శిక్షితులైన స్థానిక సహాయకులను కలుసుకుని ఆ జిల్లాలోని వ్యవసాయ విధానాలను ముఖ్యంగామిర్చి, పొగాకు, వరిగ, యితర మెట్ట ధాన్యాల పంటను గురించి తెలుసుకున్నారు.

పురోగాములైన రైతులు, శిక్షితులైన గ్రామ సహాయకులు రాష్ట్రంలోని యితర ప్రాంతాలలోని అభివృద్ధి కార్యక్రమాలను, వ్యవసాయ విధానాలను చూచి, మాట్లాడుకొనే సౌకర్యాలను కలిగించుటకై రాష్ట్ర ప్రభుత్వం సంకల్పించిన పథకం క్రింద తూర్పుగోదావరి, విశాఖపట్నం, శ్రీకాకుళం

జిల్లాల అభివృద్ధి కేంద్రాలను చూచుటకై యిట్టిదే మరొక జట్టు గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలనుంచి పంప బడింది.

## చేవెళ్ల కేంద్రం

అభివృద్ధికేంద్రం ముఖ్య కార్యాలయంగల చేవెళ్లలోను, గ్రామస్థాయి కార్యకర్తల ముఖ్య కార్యాలయాలుగల పది గ్రామాలలోను 15-8-58న స్వాతంత్ర్య దినోత్సవం జరుపబడింది. ఆసందర్భంలో పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టబడినవి. ఆటల పోటీలు జరుపబడి, గెలిచినవారికి బహుమతులివ్వ బడినవి. సాంస్కృతిక కార్యక్రమాలుకూడా జరుప బడినవి. వాటిలో గ్రామీణులు పాల్గొన్నారు.

ఆగస్టునెలలో కనకమామిడిలో జిల్లా పశువైద్యాధికారిచే పశువుల ప్రథమ చికిత్సాకేంద్రం ప్రారంభింప బడింది. అభివృద్ధికేంద్రం ప్రాంతంలో ప్రారంభింపబడిన తొలి కేంద్రం యిదే. గ్రామీణులు యీ కేంద్రానికి ఒక గదిని యిచ్చారు. పరికరాల కొను గోలులో తమ భాగంగా రూ. 125 యిచ్చుటకు వాగ్దానం చేశారు.

మంగళారంలో 20-8-58 వరకూ ప్రత్యేక గ్రామనాయకుల శిక్షణా శిబిరం జరుపబడింది. ఈ శిబిరానికి ఆ మండలంనుంచి 50 మంది నాయకులు వచ్చారు. శిబిర నిర్వహణకై గ్రామీణులు రూ. 75 యిచ్చారు.

చేవెళ్ల గ్రామాన్ని మెయిన్‌రోడ్డుతో కలుపుతూ ఒకరోడ్డు నిర్మించబడింది. ఇందులో గ్రామీణులు చురుగ్గా సహకరించారు.

## రోలుగుంట

రోలుగుంట అభివృద్ధికేంద్రంలో జూలై నెలలో వ్యవసాయం క్రింద జరిగిన పనులు యివి:

1. పంపిణీఅయిన వుత్తమ విత్తనాలు (2295 మణుగులు.)
2. పచ్చిఎరువు వేయబడిన భూమి (2160 యెకరాలు.)
3. పంపిణీ చేయబడిన రసాయన యెరువులు (1311 మె.)
4. జపానుపద్ధతి వరిసాగు క్రిందకు తేబడినభూమి (337 యె.)
5. పంపిణీ చేయబడిన కాయగూరల విత్తనాలు (7 1/2 పౌనులు.)
6. వేసిన విత్తనాల క్షేత్రాలు (10)
7. వేసిన పెరటితోటలు (360)
8. విత్తుకొట్టిన పశువులు (136)

వివిధ వ్యాధులకు పశువులకు, కోళ్లకు చికిత్స చేయబడింది. సాధారణంగా వచ్చే జబ్బులు రాకుండా టీకాలుకూడా వేయబడినవి

ఆనెల మొదటివారంలో వనమహోత్సవం, గ్రిరిసిడియా వారముకూడా జరుపబడ్డాయి. ఆవారంలో 740 పళ్లమొక్కలు, 17,647 యితర చెట్లు నాట బడినవి.

4 1/2% ఆంధ్రప్రదేశ్ స్టేట్ అభివృద్ధి ఋణానికి సొమ్ము సేకరించుటలో అభివృద్ధికేంద్రం సిబ్బందికి శిక్షితులైన గ్రామ సహాయకులు తోడ్పడారు. ఈ సందర్భంలో వివిధ గ్రామాలలో రూ. 28,800 వసూలు చేయబడినవి. బుచ్చన్నపాలెం, గంగవరం, పాపన్నపేటలలో మంచినీటి బావుల త్రవ్వకంపని పైనెలలో పూర్తిచేయబడింది.

ఆ నెలలో ప్రజలు రూ. 7898 విరాళంగా యిచ్చారు. అభివృద్ధికేంద్రం నిధులనుంచి రూ, 9,922 ఖర్చు పెట్టబడినవి.

## మల్లారెడ్డి, వేదనగరం

స్వాతంత్ర్య దినోత్సవాన ఆళ్లగడ్డలో బ్రహ్మాండమైన నాటక మహోత్సవం యేర్పాటు చేయబడింది. 29-8-58 నుంచి 31-8-58 వరకూ పెద్దచింతకుంటలో గ్రామ సహాయకుల శిక్షణాశిబిరం యేర్పాటు

చేయబడింది. 50 మంది సహాయకులు శిక్షణ పొందారు.

కర్నూలు, కడపజిల్లాల నుంచి యెన్నబడిన 10 మంది గ్రామ నాయకులు 7-9-58 న యీ అభివృద్ధి కేంద్రం ప్రాంతాన్ని దర్శించారు.

## సంజమల

కర్నూలు జిల్లా సంజమల అభివృద్ధి కేంద్రంలో 1958 ఆగస్టు నెలలో జరిగిన కృషి వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి :

13 పౌనుల కాయగూరల విత్తనాలు, 266 మణుగుల రసాయన యెరువులు పంపిణీ చేయబడినవి. 63 పెంట యెరువు గుంటలు తవ్వబడినవి. 'కంట్రీ బ్యూషన్' ప్రాతిపదికపై 73 పిట్టలు. 159 గ్రుడ్లు పంపిణీచేయబడినవి. పశువుల ప్రథమ చికిత్సా కేంద్రం ప్రారంభానికై ఆలూరు గ్రామం నుంచి రూ. 125/- వసూలు చేయబడ్డాయి.

బేలం గ్రామాంలో సహకార సంఘం ప్రారంభానికై వాటా మూల ధనంగా రూ. 300, నాసంలో బహుళార్థ సాధక సంఘానికై రూ. 500/- వసూలు చేయబడినవి. తోళ్లమడుగు గ్రామంలో ఒక కొత్త పాఠశాల ప్రారంభించబడింది. ఉన్న పాఠశాలలు 12 అభివృద్ధి పరచబడినవి.

రెండు వయోజనవిద్యా కేంద్రాలు, ఆరు సామాజిక కేంద్రాలు ప్రారంభింపబడినవి. ఆగస్టు నెలలో చింతరాయపల్లె, వుప్పలపాడు గ్రామాలలో రెండు గ్రామ సహాయకుల శిబిరాలు నడుపబడినవి. శిబిరాలను నడుపుటకై ప్రజలు రూ. 603 యిచ్చారు. రెండు శిబిరాలలోను 102 మందికి శిక్షణ యివ్వబడింది. రెండు గ్రంథాలయాలు ప్రారంభింపబడినవి. ఇందునిమిత్తం ప్రజలు వస్తు రూపంలో రూ 425 యిచ్చారు, ప్రజల సంస్థల యూనిట్లు 5 అభివృద్ధి చేయబడినవి. 26 బావులు శుభ్రి పరచబడినవి. నాసం గ్రామంలో పిల్లలకు ఒక పార్కు నిర్మించబడింది.





రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేనసచార్, ఆయన సతీమణి శ్రీమతి లలితాసచార్‌లు బహుళార్థసాధక ఆహారం నమూనాలను పరిశీలిస్తున్నారు.

# బహుళార్థసాధక ఆహారం

మైసూరులోని కేంద్ర ఆహార టెక్నలాజికల్ పరిశోధన సంస్థలోను, బెంగుళూరులోని భారతీయ శాస్త్ర సంస్థలోను జరిగిన పరిశోధనల ఫలితంగా యెక్కువ పుష్టినిచ్చే చవక ఆహారం -బహుళార్థ సాధక ఆహారం కనిపెట్టబడింది. ఇది ప్రత్యేకంగా తయారు చేయబడిన వేరుసెనగపిండి, సెనగ పిండిలతో తయారు చేయబడినది; దీనికి వలసిన ప్రమాణంలో ముఖ్యమైన ఖనిజాలు, విటమిన్లు చేర్చబడినవి. పుష్టివిషయంలో యిది అమెరికాలో తయారు చేయబడిన బహుళార్థసాధక ఆహారంతో సమానంగా వుంది.

భారతీయ బహుళార్థసాధక ఆహారం (బ. సా. ఆ,) ప్రధానంగా మామూలు ఆహారానికి తోడు ముఖ్యంగా పిల్లలు, బాలెంత, మాలెంతలు, బలహీనమైన యితరులు వుపయోగించుటకై వుద్దేశించబడింది. రెండు ఔన్సులు లేక 10 టీస్పూనుల యీ ఆహారం ఖరీదు యించుమించు 1 1/4 అణాలు. ఇందులో పెద్దవారికి రోజూ కావలసిన మాంసకృత్తులు, విటమిన్లు, ఖనిజాలలో దగ్గరగా మూడోవంతు వుంటాయి. పిల్లల్లో వీటిలోపంవల్ల కలిగే లోపాలను నివారించుటకు యిందులో సగం చాలు.

ఈ భారతీయ బ.సా.ఆ. లో గల విశేషమేమిటంటే, దానివల్ల ఆహారపు అలవాట్లను మార్చుకోనవసరం లేదు. ప్రస్తుతం అది రెండు రూపాలలో లభ్యమవుతున్నది. 1. ఉప్పు, మసాలాదినుసులు మున్నగు వాటితో కలిపి తయారుచేయబడి కారం భక్ష్యాల తయారీకి అనువుగావుండేది. 2. టోఫీ, పారిడ్జి, పుడ్డింగు, బిస్కట్లవంటి తీపి వస్తువుల తయారీకి పనికి వచ్చే ముడివస్తువు. నిజానికి మామూలు ఆహార పదార్థాలను తయారు చేసేటప్పుడు దీనిని 100కి

20 వంతుల వరకూ కలిపి, తద్వారా ఆయా పదార్థాల ఆహార విలువను, రుచిని పెంపొందించవచ్చు.

భారతీయ బ. సా. ఆ. గల వివిధ భక్ష్యాలు మైసూరులోని కేంద్ర ఆహార టెక్నలాజికల్ పరిశోధన సంస్థలో ప్రమాణీకృతం చేయబడినవి.

## భారీ-యెత్తు తయారీ

న్యూఢిల్లీలోని శాస్త్రీయ, పారిశ్రామిక పరిశోధక శాఖ డైరెక్టరు బ. సా. ఆ. పెద్దయెత్తు తయారీకై పథకాలను ప్రవేశ పెడుతున్నారు. ఈ విషయంలో మార్గగామియయిన ఎస్. ఆర్. అండ్ ఎస్. ఆర్. మంత్రిత్వశాఖకు కృతజ్ఞత తెలపాలి. మొదట యించుమించు 5 టన్నుల బ. సా. ఆ. తయారు చేసే యంత్రాలను మైసూరులోని కేంద్ర ఆహార టెక్నాలాజికల్ పరిశోధన సంస్థలో నెలకొల్పాలని తలపెట్ట బడింది. ఆ తరువాత దేశంలో వేర్వేరు ప్రాంతాలలో అట్టివే మరి 9 యంత్రాగారాలు నెలకొల్ప బడతాయి.

బ. సా. ఆ. తయారు ధరకు భారతదేశం లక్షలకు ఆహారం (మీల్సుఫర్ మిలియన్సు) అసోసియేషన్ ద్వారా పంచిపెట్ట బడుతుంది. ఈ అసోసియేషన్ యిటీవలనే కేంద్ర వ్యవసాయ శాఖా మంత్రి డా. పంజాబురావు ఎస్. దేశముఖ్ చే ప్రారంభింపబడిన సేవా సంస్థ.

ఈ అసోసియేషన్‌కి క్రిందటి సంవత్సరం కేంద్ర ప్రభుత్వం లక్ష రూపాయలను గ్రాంటుగా యిచ్చింది. అది సుమారు 150 ఆస్పత్రులకి, సంస్థలకి ఆహార పొట్లాలను పంచి యిచ్చింది.

బ. సా. ఆ. పౌను ఖరీదు యించుమించు 62 నయాపైసలు. దానితో తయారైనబిస్కట్లు చాలా రుచిగా వుంటాయి. పౌను బిస్కట్ల వెల రూ. 1.50 న.పై. వరద బాధిత ప్రాంతాలలో లక్ష రూపాయల విలువగల బిస్కట్లు పంచబడినవి.



# అభిప్రాయ వేదిక

## "సాధ్యమైనదంతా"

'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రిక 3-9-58 న యిలా వ్రాసింది :

"ఉత్తరదేశంలో వరదలు యేటేటా వస్తూ వుంటాయి. ఈ సంవత్సరంకూడా అస్సాం, పశ్చిమ బెంగాలు, బీహారు, ఉత్తరప్రదేశ్, పంజాబులలో విస్తారప్రదేశాలు మునిగి పోయాయి. ఈప్రాంతాలు పెక్కిటిలో ప్రతియేటా వచ్చే వరదలను నిరోధించడం కనీసం అదుపులో పెట్టడం సాధ్యమేకాని వివిధ కమీటీల నివేదికలు, చైనాకు ప్రతినిధివర్గాన్ని పంపుట, వివిధ సమావేశాలు, గోష్ఠులవల్లకూడా పొంగిపొర్లే నదులను అదుపులో పెట్టుటకేమీ పని జరుగలేదు.

"వరదలు దైవలీలలని చెప్పవలసిన ప్రాంతాలు మరికొన్నికూడా వున్నాయి. గోదావరి వుపనది కడం పొంగువల్ల అట్టి వరదరాగా ఆంధ్రలో కొన్ని భాగాలు దెబ్బతిన్నాయి. ముఖ్యంగా పెద్దూరు గ్రామం సమీపంలో ఆనదిపై యిటీవలనే నిర్మింపబడిన ఆనకట్టకు గండ్లుపడటం తీవ్రమైనది, ఒకమైలు నిడివికి మించివున్న యీ ఆనకట్ట 67,000 యెకరాలకు నీటిపారుదల లభింప చేస్తుందని భావింపబడుతున్నది.

"ఆపుటకు వుద్దేశించినదానికి మూడురెట్లు వరద రాగా కాలవ కుడి, యెడమ గట్లకు గండ్లుపడ్డాయి. ముఖ్యమంత్రి వరద స్థలాన్ని తక్షణం దర్శించుటను బట్టి కష్టాలలోవున్న వేలాది ప్రజల యిబ్బందుల నివారణకు సాధ్యమైనదంతా చేయుటకు ప్రభుత్వం సంసిద్ధంగా వున్నదని అనుకోవచ్చును.

## వ్యత్యాసం

'మెయిల్' పత్రిక 27-9-58న తన సంపాదకీయంలో యిలా వ్రాసింది :

"1956-57లో ఆంధ్ర, కేరళల పరిపాలనపై నివేదికలు ప్రచురించబడినవి. మద్రాసు వెనుకాడుతున్నట్టు కనబడుతుంది: యీ సంవత్సరంలో జరిగిన పూర్తికథను యింకా చెప్పవలసివున్నది. ఈ కాగితాలు అవి చెప్పే వుదంతాలు జరిగిన 17 నెలల తరువాత వచ్చినా, అవి వుపయోగ కరమైనవి. ఆసక్తితో చూడదగినవి. 1957-58కి సంబంధించినవి జరిగే అధికార సంవత్సరం సమాప్తి కాకుండా వెలువడాలని అభిలాష. కామన్‌వెల్తులో కమ్యూనిస్టు ప్రభుత్వం క్రిందనున్న మొట్టమొదటి రాష్ట్రమయిన కేరళను విదేశాలు ఇండియాలో మరే రాష్ట్రాన్ని గమనించనంత శ్రద్ధగా గమనిస్తున్నవి. దాని నివేదికను ప్రస్తుతపు కమ్యూనిస్టు ప్రభుత్వం ప్రకటించినా, దానిలో 1957 లో అది వచ్చుటకు పూర్వం జరిగిన విషయాలుకూడా అందులో వున్నాయి; సమీక్షలోనున్న సంవత్సరంలో మొదటి 7 నెలలు తిరువాన్కూరు-కొచ్చిన్ రాష్ట్ర అధ్యక్షుని పాలనలో వున్నది; యిది 1956 నవంబరులో కేరళ రాష్ట్రం యేర్పడిన నాటినుంచి 1957 ఏప్రిల్ వరకూ కొనసాగింది.

"ఈ రెండు నివేదికలు ఒకేసారి అనుకోకుండా వెలువడ్డాయి, కాని అందువల్ల ప్రజల దృష్టి ఆంధ్ర కేరళల మధ్యగల సామ్యాలు, తేడాలపై కేంద్రీకృతమవుతున్నది. 1,05,700 చదరపుమైళ్లు విస్తీర్ణం గల ఆంధ్ర భారత దేశంలో మిక్కిలి పెద్ద రాష్ట్రాలలో ఒకటి: 15,000 చదరపుమైళ్లు విస్తీర్ణం గల కేరళ ఇండియా చివర నున్న ముక్క. అచిరకాలంలోనే తోక కుక్కనే ఆడించగలదని కేరళ ముఖ్యమంత్రి ఆశ. కమ్యూనిస్టు పార్టీ పూర్తి పార్లమెంటరీ కాలం 5 సంవత్సరాలు అధికారంలో వుండాలని ప్రజలు వాంఛిస్తున్నారనీ, అది సాధించిన పనుల దృష్ట్యా చూస్తే, యితర రాష్ట్రాల వారుకూడా

వచ్చే సాధారణ యెన్నికలలో కమ్యూనిస్టులకే ఓటు చేస్తారనీ ఆయన మంగుళూరులో సభలో చెప్పారు, ఇది సందేహం. కేరళలో కమ్యూనిస్టులు చాలమంది కార్మికులను వశపరచుకున్నారు. వీరు మంత్రివర్గాన్ని తొలగించుటకు చేసే ప్రయత్నాలను యెదుర్కొంటున్నారు, యెల్లప్పుడు అహింసాత్మకంగా కాదుకూడా. రాష్ట్రంలో కల్లోలం, అభద్రతలవిషయానికి సంబంధించిన ఫిర్యాదులను పిచారించాలనే కాంగ్రెసు నాయకులవాణిని త్రివేంద్రంలోని కమ్యూనిస్టు ప్రసంగాలు ముంచివేయవచ్చు. కాని కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చుటకు తోడ్పడి మోసపోయామని మధ్యతరగతి వర్గీజులు అనుకుంటున్నారు.

"వ్రాతలో పేర్కొనబడిన కార్యకలాపాలు రెండు ప్రభుత్వాల విషయంలోను ఒకేపద్ధతిలో వున్నాయి. ఖరీదైన కేరళ నివేదిక ఎర్రట్ట కాక నీలంఅట్టతో వుండి ప్లానింగు కమిషన్ ప్రచురణలను పోలివుంది. ఈ అవధరణ తగియేవున్నది, ఎందువల్లనంటే, కమ్యూనిస్టు ప్రభుత్వం, దాని పరమావధి భిన్నమైనప్పటికీ, కమిషన్ ఆశయాలను అవలంబించింది. శిస్తుతగ్గింపు, భూకమతాలకు గరిష్ఠ పరిమితి నిర్ణయంవంటి ఒకేరకమైన భూసంస్కరణలను చేస్తున్నవి. ఆంధ్ర, కేరళలునేడు. ఈ కార్యక్రమాలు యింత వరకూ కమ్యూనిజం పురోగమనానికి అడ్డుగా నిలిచిన పెద్ద భూస్వాముల తరగతిని ఛేదించి దాని సత్తాను తగ్గిస్తున్నవి. కాని కమ్యూనిస్టులు యితర భూసంస్కరణ వాదులకంటె యెక్కువగా స్వయం నిర్ణయానికి అంటిపెట్టుకొని వుంటారు. వారొక నిర్ణయం తీసుకొన్నప్పుడు, దానికి శాసనసభ ఆమోదం లభించినట్లే భావిస్తున్నట్టు కనబడతారు. కేరళలో భూస్వామిక పద్ధతిని మార్చే బిల్లుకు యింకా శాసనసభ ఆమోదం లభించవలసి వున్నది: అయినా దాని ప్రచారకులు అది అమలులోనికి వచ్చినట్లే వూహిస్తారు. వారి ప్రచారం ఫలితమేమిటంటే చాలమంది కౌలుదార్లు అసలు శిస్తు యేమీ చెల్లించనంటారు.

"ఆంధ్రలో నీటి పారుదల సౌకర్యాల విస్తరణ, ఆధునిక వ్యవసాయ పద్ధతుల అమలు, యెక్కువ రసాయన యెరువుల వాడకాలవల్ల ఆహారోత్పత్తి గడచిన అయిదు సంవత్సరాల సగటు కంటె రమారమి 100కి 25 వంతుల వరకూ హెచ్చింది. ఇది గమనార్హం. 1953-57 మధ్య పంచదార వుత్పత్తి 110 శాతం, సిమెంటు, బొగ్గుల వుత్పత్తి వరుసగా 30 శాతం 110 శాతం పెరిగాయి. కేరళలో ఆహార పరిస్థితి మొత్తం మీద తృప్తికరంగా వుందిట; పంచవర్ష ప్రణాళిక క్రింద ఆహారోత్పత్తికి 2,62,000 టన్నుల లక్ష్యం నిర్ణయించబడగా 80,000 టన్నులు హెచ్చిందిట. అసంతోషకరమైన విషయమేమిటంటే. నేరాలు రెండు రాష్ట్రాలలోను హెచ్చాయి. ఇందుకు కారణం ఆంధ్రలో సుముఖంగా లేని ఆర్థిక పరిస్థితులు అని కేరళలో అధిక జీవనవ్యయం, నిరుద్యోగాలు అనీ చెప్పబడింది.

"సమీక్షలో నున్న సంవత్సరంలో రెండు రాష్ట్రాలలోనూ కూడా రాకపోకల సౌకర్యాలు, పబ్లిక్ వర్క్సు, వైద్య రక్షణ, సాంఘిక సంక్షేమం, తదితర కార్యక్రమాలు చెప్పుకో తగినంతగా పురోగమించాయి. విద్యాపై హెచ్చిన వ్యయాన్ని గురించి ప్రత్యేకంగా పేర్కొనవచ్చు. విద్య, శాస్త్రీయ అభివృద్ధిపై ఆదాయంలో ఆంధ్రలో 17.60 శాతం కేరళలో 30 శాతం ఖర్చు పెట్టబడ్డాయి. 'కేరళ నివేదిక ధాటిగాయిలాక్లుప్తీకరించబడింది: క్రింది నుంచి పైకి అన్ని గ్రేడ్‌లలోను యిట్టి విద్యా సంస్థల సంపద మరేరాష్ట్రానికి లేదు. విద్యపై తన ఆదాయంలో యింత యెక్కువ భాగాన్ని మరేరాష్ట్రం ఖర్చుపెట్టడంలేదు. అక్షరాస్యుల సంఖ్య యింత యెక్కువగా వుందని మరేరాష్ట్రమూ గర్వంతో చెప్పుకోలేదు.' కాని అధికార, అనధికార యేజన్సీల సమష్టి కృషితో అంత సాధించినచోట ప్రస్తుత మంత్రివర్గం సంకల్పించినట్టు పాఠశాలల జాతీయకరణకై ప్రభుత్వం తన అధికారాన్ని విస్తరించటం లేక అధికారాన్ని తీసుకొనటం యెందుకో బోధపడదు'.

—:o:—

“మిస్. జులేఖ సెట్ మీదకు వచ్చు
టకు నిరాకరిస్తున్నది. **టినోపాల్** తో
తెలుపు జేయబడిన చీరెను ధరించియున్న ఆ
“ఎక్స్ట్రా” దృశ్యమును చూరగొను చున్నది
అని ఆమె చెప్పుచున్నది.”




“టినోపాల్” జె.ఆర్. గెయ్‌గి ఎస్.ఎ. బాల్,
స్విట్జర్లాండ్, వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

నిర్మించిన వారు : సుహృద్ గెయ్‌గి ప్రైవేట్ లిమిటెడ్, వాడి వాడి, బరోడా.
సోల్ డిస్ట్రిబ్యూటర్లు: సుహృద్ గెయ్‌గి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్, పి.ఒ. బాక్స్ నం. 965, బొంబాయి.

[illegible] టినోపాల్ తెల్ల బట్టలను అన్నిటికన్న అతి తెల్లగా జేయును

SISTA'S-SG-43-TEL.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్నమొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

*భారతదేశంయొక్క*

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి!

***మీ డబ్బును యీ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!***

| | |
|---|---|
| *12 సంవత్సరముల నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు* | పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ కొనవచ్చు. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅక్కౌంట్లు* | రూ. 25 ల నుంచి రూ. 10,000 ల వరకూ గల నిల్వలపై నూటికి 2½ వంతులచొప్పునా, రూ. 10,000 లను మించిన నిల్వలపై నూటికి 2 వంతుల చొప్పునా వడ్డీ ఇవ్వబడుతుంది. |

### 15 సంవత్సరముల ఆన్యూయిటీ సర్టిఫికెట్లు (రెండవ సీరీస్)

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు : రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300 రూ. 26,600. | ఈ సొమ్ము, నూటికి సంవత్సరానికి కొంచెమెక్కువగా 4 వంతుల చొప్పున యిచ్చే చక్రవడ్డీతో సహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకు కొనవచ్చు. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*

## *భావి భారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, యీ పెట్టుబళ్ళకి సంబంధించిన నిబంధనావళికొరకు :

నేషనల్ సేవింగ్సు కమిషనర్, నాగపూర్ చిరునామాకికాని లేక

రీజియనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు (దక్కన్)

చిరునామాకి కాని వ్రాయాలి.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

—★—

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మి.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు–దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, చెకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్
**సమాచార, పౌరసంబంధముల శాఖ**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైద్రాబాదు దక్కన్ — 1.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42,912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |
| **సగటు వర్షపాతం** | | |
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కౌళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54 21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్రీ రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 47 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | ... రూ | 175.37 కోట్లు |
| **1958-59 బడ్జెట్టు :** | | |
| ఆదాయం | ... రూ | 63.66 కోట్లు |
| వ్యయం | ... ,, | 62.87 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... ,, | 21.29 ,, |



శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాల నక్కపల్లి, కోరుకొండ, చోడవరం, ఉర్లాం, రాజానగరం, కోటవురట్ల, షేర్ మహమ్మదుపురం, కొత్తపేట, సీతంపేట, పెందుర్తి, సబ్బవరం అభివృద్ధి కేంద్రాలకు చెందిన శిక్షితులైన గ్రామ సహాయకులు యిటీవల గుంటూరు జిల్లాలో పర్యటించారు.

కూర్చున్నవారు 1. శ్రీ విద్వాన్ జి కనకయ్య, తాడికొండ, 2. శ్రీ కె సీతారామరాజు, నక్కపల్లి కేంద్రం, 3. శ్రీ కె ఎస్. భాస్కరరావు, జట్టు నాయకుడు, కోరుకొండ కేంద్రం, 4. శ్రీ ఎల్. మాల కొండయ్య, గుంటూరు జిల్లా ప్లానింగు ఆఫీసరు 5 శ్రీ వి. వి. వి. సత్యనారాయణ, చోడవరం కేంద్రం, 6 శ్రీ ఎమ్. రామయ్య, జగ్గాపురం వైస్-ప్రెసిడెంటు, నాదెండ్ల బ్లాకు పంచాయతీ సమితి, 7 శ్రీ కె. సుబ్బయ్య నాయుడు, ఉర్లాం అభివృద్ధి కేంద్ర.

నిల్చున్నవారు, మొదటి వరుస : 8 శ్రీ పి. వి రామచంద్రరావు, రాజానగరం అభివృద్ధి కేంద్రం, 9 శ్రీ సి హెచ్. రాము నాయుడు, కోటవురట్ల కేంద్రం, 10. శ్రీ బి. సీతారామనాయుడు, షెర్ మహమ్మద్ పురం, 11 శ్రీ జి. కృష్ణ మూర్తి జిల్లా పబ్లిసిటీ అసిస్టెంటు, 12 శ్రీ ఎ. హనుమంతురావు, నాదెండ్ల కేంద్రం, 13 శ్రీ ఎన్. నాగభూషణ రావు, కొత్తపేట కేంద్రం.

నిల్చున్నవారు, రెండవ వరుస : 14 శ్రీ ఎమ్. సుబ్బన్న, సీతంపేట కేంద్రం, 15 శ్రీ పి. నరసింహులు, పెందుర్తి కేంద్రం, 16. శ్రీ సి. హెచ్. పి. బల్లన్న, సుబ్బవరం కేంద్రం.